స్వర్ణోత్సవ సమితి పక్షాన సన్మానింపబడుతున్న హిందీ పండితులు



**పేరు : సున్నం గంగాధరాచారి**

కేంద్రం: వి. మాడుగుల

అర్హతలు: ఎం.ఏ., సాహిత్యరత్న

వృత్తి ; హిందీ లెక్చరర్

అభిరుచి : నాటికలు వ్రాయుట, స్వర్ణోత్సవ హిందీ పరిచయపరీక్ష నందు ప్రత్యేక కృషి

చిరునామా : ప్రభుత్వ జూనియర్ కళాశాల, వి.మాడుగుల, విశాఖ జిల్లా.



**పేరు ; కొంపల్లి వీరభద్రరావు**

వృత్తి : హిందీ పండితులు

కార్యక్షేత్రం : కొత్తపట్నం

అర్హతలు : మెట్రిక్, రా.భా., ప్రవీణ

అభిరుచి : హిందీ ప్రచారం, పరిచయ పరీక్ష నందు ప్రత్యేకకృషి

చిరునామా : హిందీ ప్రేమీమండలి, ఈతముక్కలపోస్టు, ప్రకాశం జిల్లా





**పేరు : తంతంపాటి రామలక్ష్మి**

వృత్తి : హిందీ పండితులు

కేంద్రం : కైకలూరు

అర్హతలు : బి.ఏ., రాష్ట్రభాష, ప్రవీణ

అభిరుచి : హిందీ ప్రచారం, పరిచయ పరీక్ష నందు ప్రత్యేకకృషి

చిరునామా : జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల భుజబలపట్నం, కృష్ణా జిల్లా.




సాహిత్య మాసపత్రిక

**396**

ఏప్రిల్, 1987 సంపుటి : 84, సంచిక 1

వార్షికచందా : పదిహేను రూపాయలు విడిప్రతి : రూపాయిన్నర

సంపాదకులు

ఎ. రామస్వామి

# ఈ సంచికలో

సంపాదకీయం

# నూతన సంవత్సరము

స్రవంతి పాఠకులకు, కవులకు, రచయితలకు ప్రభవ సంవత్సర ఉగాది శుభాకాంక్షలు. ఈ ఉగాదితో స్రవంతి ముప్పది మూడు సంవత్సరాలు పూర్తి చేసుకొని ముప్పది నాల్గవ వత్సరంలో ప్రవేశించింది. తెలుగునాట కాలగమనం మరొక అరువది సంవత్సరాల గణనాక్రమం పూర్తిచేసుకొని మరొక ఆవృత్తిలో ప్రవేశించింది. స్రవంతి పత్రిక గత ముప్పది మూడు సంవత్సరాలుగా భాషా సాహిత్య రంగాలలో చేస్తున్న కృషికి ఆంధ్ర సాహితీప్రియుల అండదండలు లభించి ఇంతకాలం దీనిని నిర్విఘ్నంగా నిర్వహించుటకు ప్రోత్సాహం లభించినది. ఆంధ్ర సాహిత్య వికాసక్రమంలో గత ముప్పది మూడు సంవత్సరాలు విశిష్టతను సంతరించు కొనినవనటంలో సందేహం లేదు. అభ్యుదయ కవితోద్యమం కొంత వెనుకబట్టిన సమయంలో నూతన ప్రయోగాలు అనేకం సాగి వచన కవితోద్యమం విస్తరిల్లి ఈ యుగం వచన కవితాయుగమని పేరుగాంచిన కాలమిది. దేశ వాతావరణంలో వచ్చిన మార్పులు అనేక జాతీయ అంతర్జాతీయ సంఘటనల ప్రభావం వీటి కారణంగా తెలుగు సాహిత్యంలో అనేక కొత్త ధోరణులు ఈ కాలంలో ఉద్భవించి పరిఢవిల్లాయి. దిగంబర కవితోద్యమం, విప్లవ కవితోద్యమం, ఈ రెండు ఈ కాలానికి చెందినవి. మరల వీటిలో అనేక శాఖలు కూడా ఏర్పడటం జరిగింది. ఈ కవితోద్యమాలు కేవలం ఒక్క కవిత్వానికి మాత్రమే సంబంధించక ఇతర సాహిత్య ప్రక్రియలను కూడా ప్రభావితం చేయడం మనం గమనిస్తాం. ఇది మన సాహిత్య ప్రవాహంలో ప్రధాన ధార కాగా ఒకవంక సంప్రదాయ సాహిత్యం కొనసాగుతూ ఉన్నది. ఇంకా అనేక నూతన ధోరణులు కూడా తెలుగు సాహిత్యంలో ప్రవేశించడం జరిగింది. ఇటీవలి కాలంలో తెలుగులో విమర్శనా సాహిత్యం చెప్పుకోదగిన రీతిలో వస్తూ ఉండటం హర్షించదగిన విషయం. ఇదివరకు ఈ సాహిత్య ప్రక్రియలో మనం చాల వెనుకబడి ఉన్నామనే వారు. 1950 తరువాతి సంవత్సరాలలో మన విశ్వవిద్యాలయాలలో భాష మరియు సాహిత్యం పై పరిశోధనలు చేసే వారి

సంఖ్య గణనీయంగా పెరగడం ప్రభుత్వంచే అకాడమీలు స్థాపించబడి విమర్శకు లను ప్రోత్సహించడం కారణంగా ఇందులో మంచి అభివృద్ధి సాధించడం జరి గింది. ఈ విషయంలో స్రవంతి చేసిన కృషి కూడా ప్రత్యేకించి పేర్కొ-నదగి ఉన్నది. అనేకమంది పరిశోధక విద్యార్థుల వ్యాసాలను, విమర్శకుల విమర్శ లను ప్రచురించి సహకరించడం జరిగింది. ఇంతేగాక ప్రసిద్ధులయిన కవులతో బాటు అనేకమంది నవకవుల కవితలను ప్రకటించి ప్రోత్సహించడం జరిగింది. ఆయా ప్రముఖ కవులు, రచయితలు తమ రచనల ద్వారాను ఇతరులు ముఖ్యంగా హిందీ ప్రచారకులు చందాల ద్వారాను మాకు సహకరిస్తూ వచ్చారు, సహకరిస్తున్నారు. వారి సహకారంతో ఇకముందు కూడా స్రవంతి తెలుగు భాషా సాహిత్యాలకు సేవచేయగలదని మా విశ్వాసం—

## సభ స్వర్ణజయంతి సంవత్సరం

ఈ సంవత్సరం ఆంధ్ర సభ స్వర్ణజయంతి సంవత్సరం. స్వర్ణజయంతి ఉత్సవాలు రాబోవు అక్టోబరులో హైదరాబాదులో జరుపుటకు చురుకుగా ప్రయ త్నాలు కొనసాగుచున్నాయి. ఈ సందర్భంలో హిందీ ప్రచారకులకు, హిందీ అభిమానులకు మరియొక శుభవార్త. లోగడ స్వర్ణజయంతి ఉత్సవాలు పెద్దఎత్తున హైదరాబాదులో జరుపబడునని ప్రకటించడం జరిగింది. అందు కనుగుణంగాఅక్టో బరు నెలలో హైదరాబాదులో ఉత్సవాలు నిర్వహిస్తూనే ఈ సంవత్సరం జిల్లా స్థాయిలో కూడా ఉత్సవ సభలు, సమావేశాలు నిర్వహించుటకు ఆంధ్ర సభ కార్యవర్గము వారు నిశ్చయించారు, హైదరాబాదులో జరిగే ఉత్సవాలకు రాష్ట్రస్థాయి లేదా జాతీయ స్థాయి ప్రయోజనం ఉంటుంది. అయితే ఆయా జిల్లాలలో జరుపే ఉత్సవసభలలో స్థానిక నాయకులను, జాతీయ భాషాభిమాను లను సమీకరించి వర్తమాన పరిస్థితులలో సామాన్య ప్రజానీకం వద్దకు జాతీయ భాషను తీసుకువెళ్ళడం ఈ జిల్లా స్వర్ణజయంతి సభల ఉద్దేశ్యం. ఈ సభలకు నాందిగా 1987 మే నెలలో విజయవాడలో కృష్ణాజిల్లా సభలను జరుపుటకు నిశ్చ యించడం జరిగింది. ఈ సభలలో నాయకులు జాతీయ భాషాభిమానులు, జాతీయ భాషా ప్రచారకులు అధిక సంఖ్యలో పాల్గొని విజయవంత మొనర్చెదరని మా విశ్వాసం. స్వర్ణజయంతి సంవత్సరంలో స్వర్ణజయంతి ఉత్సవ ప్రారంభ సభలుగా కృష్ణాజిల్లా సభలు నిర్వహింప బడుతున్నవని మనవి.

# కబీరు సూక్తులు

— ఈమని దయానంద

31

రసము నెల్ల విడిచి పసలేని పిప్పిని
గానుగ ముదమార కౌగిలించు
సారమెల్ల విడిచి చప్పిడిం శించు
హీనుడెపుడు బుద్ధిహీనుడగుచు.

32

మగని మార్గమెపుడు సుగమమై యుండును
ప్రక్కదారు లెపుడు త్రొక్కదీవు
ఆడలేక మద్దెలోడని పల్కదే
ఆటవెలది నాట్యమాడు వేళ?

33

యాచనమ్ము మిగుల నీచమౌ మరణమ్ము
తిరిపెమెత్తరాదు దీనుడగుచు
బిచ్చమెత్తువాడు చచ్చుటే మేలురా!
సద్గురుండు తెల్పు సారమిదియ.

34

దేహధారులకును దివ్యమీ సుగుణమ్ము
జీవిజీవికిమ్ము జీవనమ్ము
మరల నందదిట్టి మానవ దేహమ్ము
నేటి జీవితమ్మె నిక్కువమ్ము.

35

పూలు గోయు తోటమాలిని గనినంత
పిలిచి మొగ్గలెల్ల పలికెనిట్లు
విరియబూసినట్టి విరులేరుకొంటివి
వచ్చునోయి రేపె వంతు మాకు.

పి.వి.ఆర్. మున్సిపల్ హైస్కూల్,
ఒంగోలు

# జాలరి జీవితం

ఆంగ్ల మూలం :
సరోజినీ నాయుడు

అనువాదం :
సి. కామేశ్వరరావు

సోదరులారా!
ఆద మరచి లేవండి
ఆకాశం సూర్యోదయ
అరుణ కిరణాలతో ఉజ్జ్వలిస్తుంది
రాత్రంతా ఏడ్చి ఏడ్చి
రమణీయంగా నిద్రపోతున్న పసిపాపలా
ఉషోదయ కిరణాల
ఊయల్లో నిద్రపోతుంది గాలి
రండి...
తీరంలో నున్న మన పడవలను
చేరదీసుకుందాం
కడలి అలలలో
కిలకిలా నాట్యం చేసే
మత్స్య సంపదను
మన సొంతం చేసుకుందాం
అగాధపయోధి బిడ్డలం మనం
అలసత్వం వద్దు
సముద్రపు పక్షి సంకేతమార్గంలో
సాగిపోదాం-
నీరధి మన మాత!
నీరదము మన భ్రాత!
అలలన్నీ మన
అనుంగు మిత్రులు!

సూర్యుడు పశ్చిమంలో నిద్రించి
చీకటు లలముకున్నా
సముద్రుడు సానుభూతి చేతులతో
సాగనంపుతాడు తీరానికి క్షేమంగా
పెను తుఫానులను తన
కను వప్పులలో నిలిపే సాగరుని
కరుణాంతరంగంలో
కలకాలం మన జీవితాన్ని దాచుకుందాం
తీరంలో కొబ్బరి చెట్ల నీడల్లో
తరుగులేని సమీర తరంగాలలో
పున్నమి వెన్నెల వెలుగులలో
పూసిన యిసుక తెన్నెలలో
అనుభూతి గీతాలు పాడి
ఆనందాన్ని పంచుకుందాం
కానీ....
పిడికన్న పరవశంగా నాట్యమాడుతూ
ఉవ్వెత్తున లేచే తరంగాల
నురగల చుంబనం
కలిగించే సంతోషం మిన్న!
నడుపు సోదరా!
నడుపు మన పడవలు!
సముద్రమూ ... ఆకాశమూ
సంగమించే చోటుకు!!

తిలక్ నగర వీధి
కాశీబుగ్గ 532 222
శ్రీకాకుళం జిల్లా

# ఫిడేలు రాగం

— డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు

రవీంద్రుని గడ్డం క్రిందనే నిలబడి
పూలమీద యుద్ధాన్ని ప్రకటించిన వాడు
దివినున్న కవితను భువికి దించి
ఎప్పుడూ నవ్యత్వాన్ని అన్వేషించిన వాడు
అప్పుడప్పుడు—
ఫ్రాయిడ్ మనసు పొరల్లో సంచరించి
డజను ఫిడేలు రాగాలు పలికించిన వాడు
నీలగిరి నీలిమలతో పులకించి
మాకెన్నో ఆశలు కల్పించిన వాడు
శబ్దాల జిగ్లరీతో
చమత్కారాల స్పార్కులతో
౩౬౫ రోజులూ
పన్ – చాంగం విప్పి
అష్టవిధ నాయికల ఆచూకీ చెప్పి
కవితను దయితగా చేసికొన్న
ఆధునిక పిన వీరభద్రుడు!
నవ్యప్రయోగ కవిరుద్రుడు!
ఉన్నట్టుండి—

సినీ జనారణ్యంలో పడి
దారి తప్పిన కవితా నందిని
ఒకప్పుడు
కదిలించింది
అతి నవ్యంగా మంజిని!
తండ్రి—
నెల్లూరు భోజుడు
భారత సాహితీ సురభి!
కొడుకు—
అరినాడు
శ్రీశ్రీతో భుజం కలిపిన
యువ యోధుడు!
భావ కవుల మీద ధ్వజమెత్తిన
అహంభావ కవి!!
పతా పితా కవితలు పలికించిన
పటు కుతారాల
పతాళి!!

తెలుగు రీడర్
బెంగుళూర్ యూనివర్సిటీ
బెంగుళూర్ - 560 056

# సత్వరచర్య

— జి. శ్రీశైలం

వడివడిగా సాగిపోతున్న కాల ప్రవాహంలో
కదలకుండా పడివున్న కొండచిలువలా
బద్ధకం ప్రగతినే సాధించింది
పరులకు ఆటంకమై వొదిగింది
భగవతంసం కలలు కంటూ
కాకుల గురుపీఠం నమ్మి
మోసపోతుంది
చిల్లర మల్లర తిరుగుడే
సోపానాలని భ్రమసి
బురద గుంటలో పద్మాక
దగా చేసిన ముస్తాబులు
ఇంతకాలం బాగా చాకిరి
చేయించు కున్నామని
పక పక నవ్వుకుంటున్నాయి
పడి పడి ప్రేమగా అల్లుకుంటే
చిరాకు పరాకులతో
కత్తిరింపులు చేసినా
ఆలింగనం మరచిపోలేదు
గడుసు పెళ్ళాం మొరటుతనం బాపతని
గమ్మత్తుగ నెట్టుకొస్తుంటే
చివరకు కత్తి గ్రుచ్చుకున్నప్పుడు తెలిసింది
అసలు విశ్వరూపం
కడప దాటకుండా
గ్రంథాల గదిలో పడివుండాలి గాని
కీర్తిని కొనుక్కునే కక్కుర్తి గాళ్ళ
ఛాయ లనవసరం
స్వయంకృషే అత్యవసరం

2-2-1108/12,
గోల్నాక
హైదరాబాద్-13

# దోచకు, చస్తావు?

— చిలుకమూరి సంజీవ

సమాజాన్ని
అన్యాయంగా
అక్రమంగా
నిర్దాక్షిణ్యంగా
దోచుకుంటూ
అరాచకాన్ని
అత్యాచారాన్ని సృష్టించే
దొంగలు
భారతిని విశ్వ విపణిలో అమ్మే నాయకులు
భారతి పంచే అమృతాన్ని అందరికి
అందనీయని బ్లాక్ మార్కెటీర్లు
అధికార గర్వంతో సమాజాన్ని దోచుకునే
అధికార్లు
నాయకులు
వణిజులు
నరరూప రాక్షసులు
పెరిగిన నాడు
నింగి ఆవలించి నేలను కౌగిలిస్తుంది
మహి మహాకాశాన్ని చుంబిస్తుంది
నింగి కౌగిలింతలో
మహి చుంబనంలో
అధికారులు
నాయకులు

అతమౌతారు
ప్రళయంలో నుసి మసై పోతారు

లెక్చరర్ (హిందీ)
కాకతీయ విశ్వ విద్యాలయం
వరంగల్.

# పునరుజ్జీవన కవి మైథిలీశరణగుప్త

చి|రావూరి సు|బ్రహ్మణ్యం

ఈ సంవత్సరం దేశం స్వర్గీయ మైథిలీశరణ్‌గుప్త శతాబ్ద్యుత్సవాలు జరుపుకొంటోంది. ఈ సందర్భంలో దేశంలోని సాహితీలోకం ఆ మహాకవి తన రచనల ద్వారా దేశానికి జాతికి చేసిన సేవలను సంస్మరించి ఈ మారిన పరిస్థితులలో వాటి విలువలను నిర్ధారణ చేయడం జరుగుతోంది. ఈ వ్యాసం ఆ ప్రయత్నంలో ఒక భాగం.

మైథిలీశరణ్ గుప్తగారు ఝాన్సీ చిరగాంలో 1886లో జన్మించారు. నలుగురన్నదమ్ములు. ఆయన శివ వాడు. రామభక్తుడు. తలిదండ్రులు, అన్నదమ్ములు అందరూ రామభక్తులే. కవితారచన ప్రారంభం ఈ శతాబ్దారంభంలో. వారి మొదటి కవితా సంపుటి 'రంగ్ మే భంగ్' 1909లో అచ్చయింది. అప్పటి యుగనిర్మాతగా ప్రసిద్ధుడయిన మహావీర్‌ప్రసాద్‌ద్వివేది ప్రోత్సాహంబాగా లభించింది. బెంగాలీ భాషతో బాగా పరిచయం ఉన్నది. మైకేల్ మధుసూదనదత్తుగారి కావ్యాలను హిందీలోకి అనువదించారు. 1912లో 'భారత భారతి' అనే కావ్యం వెలువడింది. ఈ కావ్యం గుప్తగారికి అపారమైన ఖ్యాతి తెచ్చిపెట్టింది. దేశభక్తి, జాతీయ భావాలతో నిండిన ఈ కావ్యం ఆనాటి యువతరానికి ఎంతో స్ఫూర్తినిచ్చింది. ఈ పుస్తకాన్ని జేబులో పెట్టుకు తిరగడమే దేశభక్తిగా భావింపబడేదారోజుల్లో. దానితో గుప్తగారు జాతీయ కవిగా ప్రఖ్యాతులయినారు. 'రాష్ట్రకవి' అని ఈయనకు పాఠకులు, సాహితీ ప్రియులు స్వచ్ఛందంగా ఇచ్చిన బిరుదు. ఈ కావ్యంలో ఉన్నత శిఖరాలనందుకొన్న ప్రాచీన భారతీయ సంస్కృతిని కళ్లకు కట్టించడం జరిగింది. మధ్యయుగంలో దానిపతనావస్థ, పతనానికి కారణాలు పేర్కొని వర్తమాన భారతీయ సమాజాన్ని పునః పూర్వవైభవంవైపు గొనిపోవలసినదిగా దేశప్రజల నుద్బోధించడం జరిగింది. ఈ కావ్యంలో భారత దేశాన్ని ఒక భూభాగంగా కాక సర్వేశ్వరుని సగుణ రూపంగా మూర్తి కట్టించారు గుప్తగారు.

"నీలాంబరపరిధాన్ హరితపట్ పర్ సుందర్ హై
సూర్యచంద్రయుగ ముకుట్, మేఖలా రత్నాకర్ హై
నదియాఁ ప్రేమప్రవాహ్, ఫూల్ తారే మండన్ హైఁ
బందీజన ఖగవృంద్, శేషఫన్ సింహాసన్ హై
కర్‌తే అభిషేక పయోద హైఁ, బలిహారీ ఇస్ వేష్‌కీ
హే మాతృభూమి ! తూ సత్యహీ సగుణమూర్తి
సర్వేశకీ ॥

(పీతపటంపై నీలాంబర పరిధానం శోభిస్తున్నది. సూర్యచంద్ర ద్వయము రత్న కిరీటస్థానాన్ని రత్నాకరుడు మేఖల స్థానాన్ని భజిస్తున్నారు. ప్రేమ ధారలు నదులరూపంలో ప్రవహిస్తున్నాయి. పూలు, నక్షత్రాలు అభూషణాలై శోభిస్తున్నాయి. పక్షులు వందిమాగధులై యశోగానం చేస్తున్నాయి. నీవు ఆదిశేషుని ఫణామండలాసీనురవు కాగా మేఘాలు అభిషేక జలాన్ని వర్షిస్తున్నాయి. ఓ మాతృదేశమా! నీవు నిజానికి సర్వేశ్వరుని సగుణరూప మనిపిస్తున్నావు )

మైథిలీశరణ్ గుప్తగారు సాకేత్, జయభారత్ అనే రెండు మహాకావ్యాలు, జయద్రథవధ్, పంచవటి యశోధర, ద్వాపర్, విష్ణుప్రియ మొదలగు 19 ఖండ కావ్యాలు వ్రాశారు. ముఖ్యంగా ఈ పేర్కొన్న కావ్యాలు వారి ఉత్తమోత్తమ రచనలని చెప్పవచ్చు. అంటే ఆయన ప్రధానమైన కావ్యరచనలు రామాయణ మహాభారతాలపై ఆధారపడినవన్నమాట, యశోధర గౌతమబుద్ధుని ధర్మపత్ని చరితను వర్ణించేదయితే విష్ణుప్రియ చైతన్య మహాప్రభువుగా ప్రసిద్ధిగన్న గౌరాంగుని భార్య కథను వర్ణిస్తుంది. ఈ కావ్యాలన్నీ దేశమంతటా ప్రసిద్ధి పడశాయి. కొన్ని ఇతర భాషల లోనికి అనూదితాలయినాయి. కొంతమంది ఇతర భాషా కవులకు నూతన స్ఫూర్తిప్రేరకాలయినవి కూడాను. ప్రతిభావంతుడయిన సాహిత్య నిర్మాతగా భారత రాష్ట్రపతి ఆయనను రాజ్యసభ సభ్యునిగా నియమించి గౌరవించారు. డెబ్బది ఎనిమిదేళ్ళ ఆదర్శ జీవితం జీవించి 1964లో స్వర్గస్థులయినారు గుప్త గారు.

ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలో గుప్తగారు కవితా వ్యవసాయం ప్రారంభించినప్పుడు ఈనాడు హిందీభాషగా దేశమంతట ప్రసిద్ధమయిన 'ఖడీబోలీ' అనే మాండలికం వచనరచనలకే గాని కవిత్వ రచనలకు పనికిరాదని నిరసింపబడేది. ఖడీబోలీ అంటే హిందీ కవిత్వరచనకు ఉపయుక్తమయినదని నిరూపించడానికి ఒక ఉద్యమమే నిర్వహింపవలసి వచ్చింది. మహావీర్ ప్రసాద్ ద్వివేది నాయకత్వాన జరిగిన ఆ ఉద్యమం ప్రేరకశక్తిగా ఖడీబోలీ హిందీలో కవితారచనలు గావించి దానిని కావ్య భాషగా తీర్చిదిద్దిన కవులలో మహాకవి శ్రీ మైథిలీ శరణ గుప్తగారు మిన్న. గుప్తగారి అమృత లేఖినిలో రూపురేఖలనుదిద్దుకొని, పుష్టిని, ఒయ్యారాలను నేర్చుకొని ఛాయావాదమనే యౌవనప్రాయంలోకి అడుగు పెట్టింది హిందీ కవితాసరస్వతి. కాలంతోపాటు మారుతూ క్రొత్త గాలులతో ఊపిరి పోసుకొంటూ గుప్తగారు ఆ తరువాత వచ్చిన ఛాయావాద, ప్రగతివాద కవితా శిల్పాలను కూడ సమర్థవంతంగా సిర్వహింపగలగటం విశేషం. ఆయన కవిత లనేకం ఉన్నత శ్రేణి ఛాయావాద ప్రగతివాద కవుల కవితలతో పోటీ పడుతూంటాయి, 'ఝంకార్' అనే కవితా సంపుటిలో భావవాద శిల్పానికి సంబంధించిన కవితలు సంకలితం కాగా ఇతర సంపుటాలలో గతి తార్కిక వాదం, కారల్ మార్క్స్ మొదలయిన విషయాలపై కూడ కవితలు వ్రాశాడాయన.

మైథిలీ శరణ గుప్తగారు ప్రధానంగా భారతీయ పునరుజ్జీవనోద్యమానికి చెందిన కవి. గుప్తగారు కవిత్వం వ్రాయటం ప్రారంభించే నాటికి ఈ ఉద్యమం దేశం మొత్తాన్ని ఉద్రూత లూగిస్తోంది. రాజా రామ మోహనరాయ్‌తో ప్రారంభమై కేశవచంద్ర సేన్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, బ్రహ్మర్షి దేవేంద్రనాథ్ ఠాకూర్, రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద వంటి వారి భావాలు దేశమంతటా ప్రతిధ్వనిస్తున్నాయి. అటు స్వామీ దయానంద సరస్వతి వేదాలకు, పురాణాలకు నూతన వ్యాఖ్యలు వెలయించి ఆర్యసమాజ సిద్ధాంతాలతో ఉత్తర భారతాన్ని ప్రభావితం చేసిన యుగమది. మహాపండితుడైన బాలగంగాధర తిలక్ జ్ఞాన వైరాగ్య భావ ప్రవణమైనదిగా ఎంచి వ్యాఖ్యానింపబడుతున్న భగవద్గీతను కర్మయోగ శాస్త్రంగా వ్యాఖ్యానించి దేశానికి క్రొత్త ఆలోచనల నిచ్చిన కాలమది. ఆ తరువాత కొన్ని ఏళ్ళకే మోహన్‌దాస్ కరమ్ చంద్ గాంధీ తిలక్ వ్యాఖ్యానం రూపుగొన్నదా అన్నట్లు అకుంఠిత కర్మయోగిగా దేశం ముందు నిలవడం జరిగింది. ఈ మహామహుల ప్రయత్నాలకు దేశ ప్రజల ఆంగ్ల విద్యాభ్యాస జనితమైన సంస్కారం కూడ తోడై దేశాన్ని వైజ్ఞానికం గాను, భౌతిక సంపదలతోను భాగ్యవంతం చేయాలనే ఆలోచన దేశమంతటా వ్యాపించింది.

భారతీయ పునరుజ్జీవనోద్యమం ప్రపంచ వ్యాప్తమైన రినైజాన్స్‌లో ఒక భాగం. భారతదేశంలో ఈ ఉద్యమం ఈ పేర్కొన్న మనీషి పుంగవుల బోధల ద్వారాను, వారు స్థాపించిన సంస్థల ద్వారానువచ్చింది. ఈ కాలంలో ప్రాచీన భారతీయ సంస్కృతి, వాఙ్మయం, విచారధార నూతన వ్యాఖ్యలతో వినూత్నార్థాలను సంతరించుకొని భారతజాతిని ప్రభావిత మొనర్చాయి. వేదాలకు, పురాణాలకు క్రొత్త దృక్పథంతో వ్యాఖ్యలు చేయబడ్డాయి. ఈ వ్యాఖ్యలు బ్రిటిష్ వారి పాలనతో పాటు మనకు సంక్రమించిన వైజ్ఞానిక, హేతువాద తత్వాలకు అనుగుణంగా చేయటం జరిగింది.

ప్రాచీన భారతంలో గార్హస్థ్య ప్రధానమయిన సంసార జీవితం కంటె వైరాగ్య ప్రధానమయిన ఆధ్యాత్మిక జీవితం ఉన్నతమయినదిగా భావించడం జరిగింది. ఈ లోకం, ఈ జీవితం అంతా నశ్వరం. దానిని త్యజించి మోక్షప్రాప్తికై ప్రయత్నించడం పరమ ధర్మం అన్న సిద్ధాంతం గౌరవ స్థానంలో ఉండేది. ఈ సిద్ధాంతం పునరుజ్జీవనోద్యమం ప్రారంభం కాక పూర్వం వరకు భారతజాతి జీవితాన్ని ప్రభావితం చేస్తూ వచ్చింది.

పునరుజ్జీవనోద్యమం మొట్టమొదట ఈసిద్ధాంతంపైన దెబ్బ తీసింది. ఈ దృశ్య ప్రపంచం హేయమైనది కాదు. జీవితం నశ్వరంకాదు. శరీరం నశించినా జీవుడు నశించడు, వ్యక్తి మరణించినా సమష్టి మరణించదు. కనుక జీవితం సమష్టి రూపంలో శాశ్వతమయినదే. శాశ్వతమయిన ఈ జీవితం ప్రేమించతగ్గది, ఆప్యాయతతో వరించతగ్గదీను. కనుక సన్యాసాన్ని కోరి ప్రపంచాన్ని త్యజించ నవసరం లేదు. విశ్వమంతా భగవన్మయము గనుక సన్యాసం గ్రహించినా విశ్వరూపుడయిన భగవంతుని సేవించడానికే గ్రహించాలి అని వ్యాఖ్యానించడం జరిగింది. గాంధీ మహాత్ముడు గృహస్థాశ్రమంలో ఉండే సన్యాసి జీవితం గడిపాడు. రామకృష్ణ మిషన్ విరక్తులయిన సన్యాసులచే నడుపబడే లోక సేవా సంస్థ. ప్రపంచము, లోకజీవితం విషయంలో భారతీయులలో వచ్చిన ఈ దృక్పథం చాల ప్రధానమైన మార్పు. ప్రాచీనులు ప్రవృత్తి-నివృత్తి మార్గాలను పేర్కొని ప్రవృత్తిని మిథ్య గాను, మాయ గాను, నివృత్తిని అత్యున్నతమైనదిగాను, వాంఛనీయమయినది గాను చెప్పగా ఈ పునరుజ్జీవనోద్యమం నివృత్తిని త్రోసిరాజని ప్రవృత్తికి పట్టం కట్టింది. దానితో గృహస్థ జీవితానికి, గార్హస్థ్యానికి ఆధారభూతమైన స్త్రీజాతికి ఆదరణ లభించింది.

ప్రాచీన భారతంలో, ముఖ్యంగా బౌద్ధమతం ప్రారంభమయిన నాటినుండీ జీవిత పరమార్థమయిన మోక్షసాధనకు స్త్రీని అవరోధంగా భావించటం జరిగింది. ఏదైనా మహత్తర లక్ష్యాన్ని సాధించదలచిన పురుషుడు స్త్రీ పరిత్యాగం చేయడం తప్పనిసరిగా భావించేవాడు. సిద్ధార్థుడు అర్ధరాత్రి భార్యను, పుత్రుణ్ణి వదలి వెళ్ళడం ప్రసిద్ధ విషయమే. సిద్ధార్థుడు గౌతమ బుద్ధుడయిన తరువాత తన మతంలో స్త్రీలను చేర్చుకోవడానికి అనుమతించలేదు. కాని ఆనందునికోరికపై స్త్రీలకు కూడ సంఘ ప్రవేశానుమతి నిచ్చాడు. ఆ సందర్భంలో బుద్ధుడు ఆనందునితో నేను ప్రారంభించిన ఈ ధర్మం అయిదు వేల సంవత్సరాలు జీవించ గలిగి ఉండేది. కాని స్త్రీలకు ప్రవేశానుమతినివ్వడంతో అయిదు వందల సంవత్సరాలు జీవించి ఉండటం దుర్లభం అన్నాడట. సాధారణంగా స్త్రీ విషయిక మయిన ఈ భావం ప్రాచీనులలో అన్ని వర్గాల వారిలోను దృఢంగా పాతుకు ఉన్నదని చెప్పవచ్చు. అయితే పునరుజ్జీవన వాదం ప్రాచీనుల ఈ భావం అర్థరహితమైనదని నిరూపించింది. సంసారస్థితికి మూలభూతమయిన గార్హస్థ్యానికి స్త్రీయే ఆధారం సమాజంలో స్త్రీకి గౌరవం లేనినాడు ఆ సమాజం పతనం కాక తప్పదు. భారతజాతి పతనానికి స్త్రీల యెడ వారికున్న హేయభావమే కారణం. నారీజాతికి

గౌరవ స్థానం లభించకపోతే దేశానికి ముక్తి లేదు— అన్న దృక్పథం ఏర్పడింది.

సమాజంలో స్త్రీ పురుషు లిద్దరూ సమానులు. పురుషునితో సమానంగా స్త్రీని గౌరవించాలి. తల్లిగాను, సోదరి గాను, భార్య గాను పురుషుని ఉనికికి మూలమయిన స్త్రీకి విద్యాబుద్ధులు గరపి విజ్ఞానవంతురాలిని చేయాలి. ఇటు గృహస్థజీవితంలోను, అటు సామాజిక జీవితంలోను, పురుషుని బాధ్యతలలో ఆమె కూడ భాగస్వామిని కాగలుగుతుంది. ఆమె నిర్వహించలేని కర్తవ్యమంటూ ఉండదు; సంఘంలో స్త్రీకి పురుషునికున్న అధికారాలన్నీ ఉన్నాయి. బానిస బ్రతుకులో నుంచి స్వాతంత్ర్యపు వెలుగులోకి స్త్రీ పయనించాలి- స్త్రీకి సంపూర్ణస్వాతంత్ర్యం ఆర్థికపరమైన అధికారాలు లభ్యమయిననాడే సిద్ధిస్తుంది_ ఇది స్త్రీ సమానత్వ స్వాతంత్ర్య భావాల వికాసక్రమం.

ప్రాచీన ఆదర్శాలకు నూతన వ్యాఖ్య- దేశాన్ని భౌతికంగా సంపన్నం చేయాలనటం, నివృత్తిప్రధానమైన సన్న్యాస జీవితం కంటె ప్రవృత్తి ప్రధానమైన గార్హస్థ్య జీవితాన్ని ఉత్తమమని భావించడం, స్త్రీజాతి సముద్ధరణ, వారి స్వాతంత్ర్యం- ఇవి పునరుజ్జీవనోద్యమం మన కిచ్చిన నూతన విషయాలు. వీటన్నిటి సమిష్టి సమన్వయమే ఆధునికత, ఈ ఆధునికతకు అద్దం పట్టిన మహాకవి శ్రీ మైథిలీశరణ గుప్త.

సాకేత్ మహాకావ్యం గుప్తగారు భావించిన ఈ ఆధునికతను పూర్తిగా ప్రతిబింబిస్తుంది. స్త్రీ స్వాతంత్ర్యాధికారాలకు సంబంధించిన భావాలు యశోధర విష్ణుప్రియ కావ్యాలలో పరిణామ క్రమంలో వర్ణితాలయిన విధానాన్ని ఇక్కడ పరిశీలిద్దాము.

సాకేత్ కావ్యం రామకథాశ్రితమే అయినా లక్ష్మణుని భార్య ఊర్మిళను నాయికగా వర్ణించడం జరిగింది. భారతీయ గార్హస్థ్య జీవితం పురుష ప్రధానమయినది. పురుషుడు ఏదయినా పరమార్థాన్ని సాధించదలిస్తే ఇల్లు వదలి వెళ్ళిపోతాడు. అప్పుడు భార్య జీవితం ఎలా ఉంటుంది? కుటుంబంలోను సంఘంలోను ఆమె స్థానమేమిటి? ఆమె ఏం చేయాలి? ఈ ప్రశ్నలకు మన ప్రాచీన శాస్త్రాలు, సాహిత్యం సమాధానం చెప్పవు పురుష ప్రధానమయిన సంఘంలో సాధకుడయిన భర్తకు స్త్రీ అడ్డంకిగానే కాని సహచారిణిగా ఉండలేదు. అయితే ఆధునిక దృక్పథం దీనిని అంగీకరించదు పురుషుని లక్ష్యసాధనలో స్త్రీకి కూడ భాగస్వామ్యం ఉంటుంది. ఆమె కూడ అతనితో కలిసి సాధన మార్గంలో పయనించగలదు. సీత అదే చేసింది లేకపోతే భర్త విజయాన్ని ఆకాంక్షిస్తూ వియోగరూపమయిన తపస్సుతో తపిస్తూ కుటుంబ శ్రేయస్సుకు, సాంఘిక సముద్ధరణకు తన జీవితాన్ని అర్పించగలదు. ఊర్మిళ ఆ పనే చేసింది.

సాకేత్ కావ్యంలో 'భర్తతోనే భార్య' అని సీత అరణ్యానికి వెడితే ఆ అవకాశం లేని ఊర్మిళ పదునాలుగు సంవత్సరాలు విరహోద్విగ్న జీవితం గడుపుతూ కుటుంబ భాగస్వామినిగా సాకేత నగర వాసినిగా తన కర్తవ్యాలను నెరవేర్చింది. అనేకకష్టాలనుభవించిలక్ష్య సాధనలో సఫలుడయి వచ్చిన భర్తను కలుసుకుంది ఊర్మిళ ఈ త్యాగమయ జీవితాన్ని కవి రాముని మాటలలో ఆమె సహధర్మచారిణి కంటె ఉన్నతమైన స్థానానికి ఎదిగి గార్హస్థ్య ధర్మస్థాపన కావించినట్లు ప్రశంసిస్తారు. అంటే లక్ష్మణుడు అడవికి వెళ్ళి సాధించిన రామసేవా రూప పరమార్థంతో సమానంగా ఊర్మిళ ధర్మనిర్వహణను పేర్కొనటం జరిగింది.

అయితే సంఘంలో స్త్రీకి జరుగుతున్న అన్యాయం సమానత్వాన్ని అంగీకరించినంత మాత్రాన సమసిపోవడం లేదు. మోక్షమార్గంలో గాని, ఏదేని పరమార్థం సాధించడంలో గాని అడ్డుగా భావించి స్త్రీని పరిత్యజించిన పురుషుడు ఆమెను అవమానానికి గురి

చేస్తున్నాడు. ఇటువంటి అన్యాయాన్ని ప్రతిఘటించి అవమానం నుండి బయట పడటమెలా? ఈ ప్రశ్నకు సమాధానం గుప్తగారి యశోధర కావ్యం.

సిద్ధార్థుడు అర్ధరాత్రి భార్య యశోధరకు చెప్ప కుండా ఆమెను విడిచి వెళ్ళిపోతాడు. ఈ సంఘటన యశోధర ఆత్మాభిమానాన్ని దెబ్బ తీసింది. భర్త తనను అర్థం చేసుకోలేక పోయినందులకు బాధపడింది. ఆమె తన భర్త గౌతముని చర్యలను, అతని లక్ష్యా లను, అతడు సంపాదించిన సిద్ధులను, వాటి తాత్వి కతను గురించి సూక్ష్మాతిసూక్ష్మంగా విచారణచేసింది. ఆమె భర్త సాఫల్యాన్ని ఆకాంక్షిస్తూనే అతను అవలం బించిన పద్ధతిని ఆమోదించలేక పోయింది. పతివ్రత యైన తను కర్తవ్యాన్ని మరచి ప్రాణత్యాగం కూడ చేయజాలదు అంతేగాదు, మోక్షాన్ని సాధించడానికి సర్వసంగ పరిత్యాగం చేయనవసరం లేదు. ఈ ప్రపంచంలో ఉంటూనే మహోన్నత లక్ష్యాల నందు కోవచ్చును. ఈ దృష్టితో ఆమె రాజాంతఃపురంలో ఉంటూనే తపోమయ జీవితం సాగించింది. తృష్ణను జయించి త్యాగఫలమందుకొన్నది. అడవికి వెళ్ళి భర్త సాధించిన దానిని తను ఇంట ఉండే సాధించింది. పర్యవసానంగా ప్రపంచానికి మోక్షమార్గం చూపిన గౌతమ బుద్ధుడు తాను వదలివెళ్ళిన స్థలానికే వచ్చి ఆమెను కలుస్తాడు. ఆమె ప్రాణప్రదంగా పెంచి పెద్ద చేసిన పుత్రుణ్ణి భర్తకు కానుకగా సమర్పిస్తుంది.

మానవ జీవితానికి అంతిమ లక్ష్యం మోక్షమయితే అందుకు స్త్రీలు అర్హులు కారా? భార్యాభర్తలు కలిసి ఉండి మోక్షాన్ని సాధించలేరా? ఈ ప్రశ్నలు మోక్షా ర్థులయిన భర్తలచే పరిత్యజింపబడిన స్త్రీలను వేధించ లేదని అనలేము. మన ఆదికావ్యంలోనే ఇందుకు సమా ధానం లభిస్తుంది. రాముడు సీతను అడవికి రావద్దని అక్కడి కష్ట నిష్ఠురాలను పేర్కొనగా సీత పలికిన మాటలే ఇందుకు ఉదాహరణ. అందుకే యశోధర స్త్రీ మోక్ష మార్గానికి అటంకమయితే మరి ఆమెకు మోక్ష మనేది లేదా? నే నెవరిని ఈ ప్రశ్న అడగాలి? అడగ వలసిన వ్యక్తి నన్ను వదలి వెళ్ళిపోయాడు. సృష్టిలో సగం స్త్రీజాతి ఉన్నది. వారికి మంచి చెడ్డలనేవి ఉంటాయి? భర్త ఉండగా భార్య అనాథ ఎలా అవు తుంది? అని వితర్కించుకొంటుంది.

సిద్ధిమార్గకి బాధా నారీ, ఫిర్ ఉస్‌కీ క్యాగతి హై?
పర్, ఉన్‌సే పూఛూం క్యా జిన్‌కోముఝ్‌సే అబ్
విరతి హై?
అర్థవిశ్వమేం వ్యాప్త శుభాశుభ్ మేరీభీ కుఛ్‌మతి హై;
మైంభీనహీం అనాథ్, జగత్‌మే మేరీభీప్రభు పతి హై॥

అయితే ఆమె ఒక నిశ్చయానికి వస్తుంది. భర్తను సంబోధించి నీవు అమృతాన్ని సాధిస్తే సాధించవచ్చు. నేను మాత్రం నా వ్యక్తిత్వాన్ని పరిత్యజించను. నీవు ముక్తికాంతను వరించి ఈ దాసిని పరిత్యజించవచ్చు; తపస్సు చెయ్యవచ్చు; అయితే నేను కూడ నా సహన శక్తిని నిరూపిస్తాను. భవిష్యత్తులో నీ గుణానువాద సమయంలో నా పేరెక్కడ ఉంటుందో గమనిస్తాను. అయితే ఒక్కటి—యశోధరా కరాగ్రహణం చేసిన నీకు అప్సరసల విఘ్నబాధ కలుగకుండుగాక— అంటుంది.

ఈ కావ్యంలో యశోధర భర్తసాధించ దలచు కొన్న అమృతత్వసిద్ధికి తన విషాదమయమైన కన్నీటిగాథకు పోటీపెడుతుంది. పురుషుల సాఫల్యం వెనుక నారీజాతి త్యాగమయజీవితం ఉంటుందంటుంది. అంతేగాని పురుషాహంకారానికి ప్రతిగా విప్లవంతేవా లనే భావం ప్రకటించదు. అందుకే భర్తకు అప్సరసల విఘ్నబాధ కలగరాదని కోరుకుంటుంది

అయితే గుప్తగారు యశోధరకావ్యంలో ఆచరిం చని విషవ విషయంలో విష్ణుప్రియకావ్యంలో ఒక అడుగు ముందుకు వెడతారు. విష్ణుప్రియ గౌరాంగుని భార్య. గౌరాంగుడు విరక్తుడై భార్యను, తల్లిని వదలి వెళ్ళిపోతాడు, సన్యాసం స్వీకరిస్తాడు దానితో ఆ తల్లి

కోడళ్ళ ప్రేమాభిమానాలు దెబ్బతిన్నాయి. విష్ణుప్రియ మాటల్లో నిప్పులు గ్రక్కుతుంది. స్త్రీని అబల అంటారు. మరి ఆ అబలను విడిచి పారిపోయినవాడు అంతకంటె దుర్బలుడు కాడా? స్త్రీ ఇల్లు విడిస్తే భ్రష్టురాలవుతుందంటారు. అదే పురుషుడు ఇల్లు వదిలితే సన్యాసి అంటారు! ఎంత తేడా!!

"అబలా కే భయసే భాగ్ గయే వే ఉన్ సే భీ నిర్బల్ నికలే
నారీ నికలే తో అసతీ హై నర్ యతీ కహాకర్ చల్ నికలే

ఆయన నా కారణంగా ఇల్లువదలి వెళ్ళారంటారు. నిజానికి ఇంటి పేరు చెప్పి ఇల్లాలినే వదులుతారు పురుషులు.

'హాయ్, మేరే కారణ్ హీ ఛోడ్ గయే ఘర్ వే
గృహిణీ హీ ఛోడతే హైఁ, నర్‌గృహ్ కహాకే'

విరక్తి మూలకమయిన ధర్మం అనాదిగా పరమార్థాన్ని సాధించదలచినవాడు స్త్రీని పరిత్యజించాలని చెబుతూవచ్చింది. అయితే ఎవరైనా స్త్రీ పరమార్థాన్ని సాధించదలిస్తే ఏం చెయ్యాలన్న ప్రశ్నకు సమాధానంలేదు. గుప్తగారూ దానికి సమాధానంచెప్పలేదు. ప్రాచీనులు స్త్రీజాతి మనస్సుపై పరమార్థ సాధన పురుషజాతి కర్తవ్యమనే ముద్ర వేశారు. అయితే ఈనాడా సిద్ధాంతంలో పస లేదు. ఆ సిద్ధాంతం నిర్వీర్యమైనదని తేలిపోయింది.

ఈనాడు స్త్రీ పురుషుల కార్యరంగాలలో తేడాలకు ఆస్కారం లేదు. సాధకుడు పాటించవలసింది సంయమం కాని పలాయనం కాదని ఆధునికుల మతం. గాంధీ మహాత్ముడు గార్హస్థ్యాన్ని పరిత్యజించలేదు. అరవిందమహర్షి స్త్రీపురుషులు కలిసే పరమార్థాన్ని సాధించగలరని చెప్పారు.

యశోధర, విష్ణుప్రియ కావ్యాలలో ఈ ఆధునిక విచారధార స్పష్టంగా కన్పిస్తుంది. విష్ణుప్రియలో అయితే గౌరాంగుని తల్లి శచీదేవి కూడ కొడుకు చర్యను గర్హిస్తుంది ఒకసారి గౌరాంగుడు శాంతిపురం వచ్చి ఉన్నాడు. ఆయన శిష్యుడు నిత్యానందుడు గౌరాంగుని తల్లిని శాంతిపురం రమ్మన్నాడని వార్త చెబుతాడు. వాకిట్లో పల్లకీ వచ్చింది. అత్తగారితో విష్ణుప్రియ కూడ బయలుదేరింది. ఆమెను తీసుకు రమ్మన లేదంటాడు నిత్యానందుడు. అది విని విష్ణుప్రియ 'అమ్మా' అంటూ స్పృహ కోల్పోతుంది. దానితో గౌరాంగుని తల్లి— 'అయితే నేనూ రాను. కోడలు అతనికేమి కాకపోతే నేను మాత్రం ఎందుకు రావాలి? నిజానికి ఈమెను రావద్దనడాని కతని కధికారమేముంది? ఆ కృతఘ్నుని ముఖం నేను మాత్రం ఎందుకు చూడాలి" అంటూ ప్రయాణం నిలుపు చేస్తుంది.

"లౌట్ జా నితాయీ తబ్ మైభీ న జావూంగీ
యహీ నహీఁ ఉన్‌కీ తో మైఁ భీ కహ్ కౌన్ హూం?
అబ్ అధికార్ ఇసే రోక్‌నే కా క్యా ఉసే?
దేఖూఁ మైఁ హీ తబ్ క్యోం ముహ్ ఉన్ కృతఘ్నకా"

ఇంతవరకు ఈ వ్యాసంలో ఆధునికతకు సంబంధించిన ఒక అంశంలో గుప్తగారు ఎంత ముందుకు వెళ్ళారో చెప్పడానికి ప్రయత్నం జరిగింది. ఇదే విధంగా ఇతర అంశాలపై కూడ ఆయన ఎంతో వ్రాశారు. అయితే గుప్తగారు ప్రధానంగా పునరుజ్జీవన యుగానికి సంబంధించిన కవి అనీ, ఆ కారణంగా ఆయన కొన్ని హద్దులలో ఉండి రచనలు సాగించడం జరిగిందనీ మనం గమనించాలి. ఆ కారణంగా స్త్రీ స్వాతంత్ర్యంలో ఆఖరి మెట్టయిన ఆర్థిక స్వాతంత్ర్యం గురించి ఆయన అంతగా చెప్పలేదు. అంతవరకు ఆ లోటు ఆయనలో లోటుగానే ఉండిపోయింది. సుమారు 60 సంవత్సరాలు కావ్య రచనలు సాగించి మధ్యమధ్యలో వచ్చిన మార్పులను ఆమోదిస్తూ చాలా ముందుకు వచ్చినా ఆయన పూర్తిగా ఆధునికుడు

కాలేకపోయారని విమర్శకుల అభిప్రాయం. కాని ఆయన పుట్టి పెరిగిన వాతావరణం, ఆయనలో ఏర్పడ్డ సంస్కారాలు వీటిని పట్టి చూస్తే ఆయనలో కన్పడే ఈ ఆధునికతే చాల గొప్ప అన్ని చెప్ప వచ్చును. రామభక్తుల కుటుంబంలో పుట్టి, స్వయంగా రామభక్తుడై స్త్రీ స్వాతంత్ర్యం విషయమై ఇంత ముందుకు వెళ్ళటమే ఆశ్చర్యం ఇక్కడ ఒక్కమాట చెప్పాలి. ఇంకా మన సంఘాన్ని పరిశీలిస్తే గుప్తగారు నడిచినంత ముందుకు కూడ అది నడిచి రాలేదని స్పష్టమవుతుంది. చట్టాలు ఎలా ఉన్నా స్త్రీ ఆర్థిక స్వాతంత్ర్యం గూర్చి ఎంత చెప్పినా, ఎంతగా స్త్రీ జాతి విద్యాజ్ఞానం సంపాదించినా మధ్యయుగం నాటి సంకెళ్ళను ఆమె తెంచుకోలేక పోతోంది. గుప్తగారు చెప్పిన చోటుకు కూడ ఆమె త్వరలో చేరుకొనే లక్షణం కన్పడటం లేదు. ఈ దృష్టితో చూస్తే ఆయన చాలా ముందుగా భవిష్యద్దర్శనం చేశారని చెప్పాలి.

ప్రిన్సిపాల్,
హిందీ మహా విద్యాలయం,
దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర
ఖైరతాబాద్, హైదరాబాదు-500 004.

# తలవంపు

తిరునగరి

మాతృదేశం కోసం సర్వస్వం
త్యాగం చేసిన వాళ్ళ రక్తాన్ని
పంచుకొని పుట్టిన వాళ్ళేనా వీళ్ళు
విశ్వమంతా ప్రాణవిభుని మందిరమని
ప్రబోధించిన భాగవతోత్తముల జాతిలో
ప్రభవించిన వాళ్ళేనా వీళ్ళు
మానవత్వానికి సాటి ఏమతం రాదన్న
సత్యాన్ని జగతికి చాటిన ఋషుల వారసులైన
వాళ్ళేనా వీళ్ళు

మాతృ దేశాన్ని దోచుకుంటున్న ఈ విద్రోహులు?
స్వీయ సంస్కృతిని మరచిన ఈ భ్రష్టులు?
మతోన్మాదంతో పెచ్చరిల్లిన ఈ హంతకులు?
ఈ ధరిత్రి రక్తసిక్త మౌతున్నందుకు
నా చరిత్ర అపఖ్యాతి పాలౌతున్నందుకు
వీళ్ళు భారతీయులైనందుకు
నేనివేళ అనంతవేదనననుభవిస్తున్నాను
నేనివేళ సిగ్గుతో తలవంచుకుంటున్నాను

కవితా సదనం
పోచమ్మవాడ, ఆలేరు 508101
నల్లగొండ జిల్లా

వజ్రాయుధం మరో అంచు :

# సోమసుందర్–బానిసల దండయాత్ర
# ఒక సమాలోచనం

— మాదిరాజు రంగారావు

బానిసల దండయాత్ర, సోమసుందర్ కృతి వజ్రాయుధం రెండో అంచు. పీడితుల పక్షం వహిస్తుంది. నిరంకుశులపై తీక్ష్ణధారతో ఉద్యమిస్తుంది. దీని లక్ష్యం సమసమాజం. దీని ఉనికి ప్రజల స్వాతంత్ర్యం కోసం. ఎనిమిది భాగాలుగా ఉన్న ఈ దీర్ఘకవితలో వస్తువు తెలంగాణా విమోచనం. కవిలో స్పందన శీలం ఉన్న హృదయతత్త్వంతో పాటు సీమల్ని అధిగమించిన ఆలోచనా ప్రసారమూ ఉంది. సామాజిక స్పృహనూ చారిత్రక పరిణామ ప్రమేయాన్ని భావింపజేసే దృష్టి కోణమూ ఉంది; ఇందులో క్రియాత్మకమైన రాజకీయ స్పర్శతో సామాజిక శ్రేయో రూపమూ తలపుకు వస్తుంది. ఈ రచనలో కవి వ్యక్తిత్వం, దేశ స్వాతంత్ర్య భావనతో ఐక్యమై సమసమాజ లక్ష్యం కలిగి మానవతా రాగంతో విలసిస్తూంది.

"రెండు ప్రపంచాల మధ్య, రెండు స్వభావాల మధ్య, రెండు వర్గాల మధ్య" జరిగే సంఘర్షణ యుగాలుగా వస్తూన్నదే. ఇక్కడ రెండు ప్రపంచాల 1) మౌలిక తత్త్వం, 2) వాటి ప్రయత్న మార్గాలు, 3) సామాజిక లక్ష్యాలూ వేరువేరు. ఈ రెండింటికీ చరిత్రలో పరస్పరం వ్యతిరేకమైన గతివైఖరి ఉంది. ఇది ఒక దశ నుండి సాధారణ స్థాయిని దాటిన కొద్దీ సంఘర్షణ అధికతరమౌతుంది. ఇదీ చారిత్రాత్మకమైన అవసరాన్ని బట్టి ఉద్యమిస్తుంది. తెలంగాణా స్వాతంత్ర్యోద్యమానికి ప్రస్తుతం పూర్తిగా అన్వయిస్తుంది ప్రజల స్వాతంత్ర్యం సౌభాగ్యం దృష్ట్యాను పరిహరింపరానిది. మొదటి గీతం ఆరంభ చరణాల్లో ఈ అంశాన్ని గమనించవచ్చు, ఒక ప్రపంచం తత్త్వంలో అసుర ప్రవృత్తి కలిగింది. గతిలో అభివృద్ధి నిరోధకమైంది, స్థితిలో ధనస్వామ్య వ్యవస్థ మార్గాన్ని అనుసరించేది, రాజరిక వ్యవస్థలో భాగమైంది. కవి ఆశించే మరో ప్రపంచం ప్రజాతంత్రమూ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలూ అభ్యుదయ గమనమూ శాంతి ప్రవృత్తీ కలిగింది. ఈ రెండు ప్రపంచాల మధ్య జరిగే సంఘర్షణమే ఈ కావ్యంలో అంతస్సూత్రం. ఇది కవి ఉద్దేశించిన స్వాతంత్ర్యోపేతమైన అభ్యుదయ సమాజం అనే వాస్తవ రూపానికి శక్తిస్థానమైంది అసాధారణ స్థితి ఎదురైనప్పటికీ రాజరికంలో నిరంకుశులు యథార్థాన్ని కళ్ళు తెరచి చూచి తెలుసుకోకుండా తమ స్థితిని భద్రంగా ఇంకా నిలుపుకునేందుకే ప్రయత్నిస్తున్నారు. వీళ్ళకు ప్రజాక్షేమం కన్నా తమ స్వార్థమూ అధికారమూ ముఖ్యం. సర్వమూ జీర్ణమై రుజాగ్రస్తమై ఉంది. అయినా యుగధర్మం గుర్తించని వీరు, ఆ యుగరథచక్రాల క్రింద నలిగి పోక తప్పదు.

దీనికి భిన్నమైంది మరో లోకం
"సమధర్మం స్థాపించగ
పర పీడనమంతరింప"

సర్వజన సౌభాగ్య వ్యవస్థకై శంఖం పూరించే యువశక్తి బంధురమయింది, దేశ స్వాతంత్ర్యంతో మానవతా రాగంతో సుహితమయింది, ఈ రెండు ప్రపంచాల లక్ష్యాలూ పరస్పరం విరుద్ధమయినవి. చారిత్రక కారణాల వల్ల, అనివార్యమయిన రాజకీయ పరిస్థితులు వీటిని మోహరింప జేశాయి. మొదటిపక్షం వర్గ ప్రయోజనాన్ని స్థిరంగా నిలిపేందుకుగడియారం "ఉక్కుముళ్ళ"ను వెనక్కు తిప్పేస్తోంది. ఇక్కడ ఉన్న రెండు ప్రపంచాల తత్త్వమూ ప్రవర్తనమూ, ప్రయత్నమూ, లక్ష్యమూ పూర్తిగా వ్యతిరేకమయినవి. ఈ చారిత్రక సత్యానికి ప్రకృత కావ్యంలో హైదరాబాదు రాష్ట్ర విమోచనం కోసం జరిగిన స్వాతంత్ర్య సమరం ప్రాతినిధ్యం వహిస్తోంది. కవి దృక్పథంలో ఈ రచనకు ఆధారతత్త్వం మార్క్సీయ భావన. ఇది నిఖిల మానవ భూమికతో స్పందించే విస్తృతమయిన సీమలు కలిగింది.

భారతదేశం పర పరిపాలన నుండి విముక్తి కోసం గాంధీజీ నాయకత్వంలో సాగించే మహోద్యమం హైదరాబాదు రాష్ట్ర ప్రజల్లో ఉత్తేజానికి కారణమయింది. ఎన్నో త్యాగాలకు సైతం సిద్ధమయి, దేశం ప్రధాన ప్రవాహంలో కలిసే స్వాతంత్ర్యేచ్ఛ రాజకీయంగా గొప్ప మలుపుకు కారణమయింది. దీనికై సామాజిక శక్తుల్ని ఏకోన్ముఖం చేసింది. ఇవి రచనలో సమ సమాజ స్థాపనకు సహభావంగానూ స్వీకృతమయింది. ఆరంభంలో స్థితి ననుసరించి వస్తువులోని అంత స్తత్వాన్ని ప్రకాశమానం చేస్తూ, ఆ తరువాత వస్తువును నిర్వహించడం అనే ప్రణాళికా సంవిధానం ఇందులో కన్పిస్తుంది. కవి విశ్వసించే మార్క్సీయ మయిన ఆదర్శం వస్తువును కొత్త దృష్టితో ఆవిష్క రించేందుకు ఉపకరించింది. ఇక్కడినుండి కవి పోరాట తరంగాలను విజృంభింప జేస్తాడు. పీడిత పీడక వర్గాల మధ్య ప్రజాస్వామ్య నిరంకుశ వ్యవస్థల మధ్య అని వార్యమయిన సంఘర్షణ చివరకు ప్రజావిజయం దిశలో "గడియారం ఇనుపముళ్ళను" వేగంగా ముందుకు పరిక్రమింపజేస్తుంది భారతదేశస్వాతంత్ర్య మహోద్యమం ప్రభావ స్ఫూర్తితో హైదరాబాదు రాష్ట్రంలో 1942 నుండి నిజాం నవాబును గద్దె దింపే ప్రయత్నం జరిగింది. 1946 నుండి (తెలంగాణా 9, మరట్వాడా 5, కర్నాటక 3) మొత్తం పదియేడు జిల్లాల్లోనూ విమోచనోద్యమం తీవ్రరూపం ధరించింది. నాయకులూ, ప్రజలూ నిర్బంధితులయినారు. ఎన్నో హింసలకు గురి అయినారు. అసువులు కోల్పోయారు. భారతదేశం స్వాతంత్ర్యాన్ని (1947 ఆగస్టు 15) పొందిన చరిత్రాత్మక సంఘటనతో ఇక్కడి ప్రజల్లో ఉత్సాహశక్తి వినూత్నమయిన తేజంతో క్రియారూపం ధరించింది. 1947 సెప్టెంబరులో కార్యాచరణ సమితి బొంబాయి సమావేశంలో తీసుకున్న నిర్ణయాన్ని అను సరించి కాంగ్రెస్ పార్టీ ఉద్యమాన్ని మరింత తీవ్రతరం చేసింది. దీనితో ఏర్పడిన రాజకీయ చైతన్యాన్ని ఎదు ర్కోడానికి పాలకులకు అశక్యమయింది. మితవాదులు అతివాదులు తీవ్రవాదులు అంతా ఎవరి క్షేత్రాల్లో వారు కార్య నిమగ్నులయినారు. కాంగ్రెస్ పార్టీ, ఆర్య సమాజ్ తదితరులూ ప్రజాశక్తినిసమీకరించి పోరాటం సల్పిన అంశం మరవడానికి వీల్లేదు. ముఖ్యంగా గ్రామాల్లో రజాకార్ల దాడులకూ అకృత్యాలకూ వ్యతి రేకంగా దళాలను ఏర్పాటు చేసి, కమ్యూనిస్టు పార్టీ నిర్వహించిన పాత్ర ప్రభావోపేతమయింది. కవి ఆశిం చిన విధంగా ఈ రచనలో అతడు విశ్వసించిన రాజ కీయ సిద్ధాంత ప్రభావం వివిధ సంఘటనల చిత్రణలో స్పష్టంగా కన్పిస్తుంది. రజాకార్, జాగీర్‌దార్, దేశ్ ముఖ్ అధికారుల నిరంకుశమయిన అధికార దుర్గాన్ని కూల్చే ప్రయత్నాలు ముమ్మరమయినాయి పోలీసు స్టేషన్లపై, రజాకార్ (అంటే వాలెంటీర్ అని అర్థం) దాడులు మొదలయినాయి. ముఖ్యంగా 1947 నుండి 1948 సెప్టెంబరు వరకు ఏర్పడిన అసాధారణమయిన రాజకీయ సంక్షోభం కవి సామాజిక దృష్టిని ఆకర్షిం

చింది. అప్పటి పరిస్థితిని బట్టి భయమూ భీభత్సమూ కరుణమూ వీరంతో సంశ్లిష్టమయిన స్థితి చిత్రణంతో కావ్యం అవతరించింది. భారతప్రభుత్వం హైదరాబాదు సంస్థానంపై తీసుకున్న పోలీసుచర్యతో 220 సంవత్సరాల నిజాం పాలన అంతమయింది. ఈ కావ్యంలో వస్తువు వెనుకనున్న చారిత్రక నేపథ్యం ఇది. దీనితో కొత్తయుగం ఆరంభమయింది.

ఇక ప్రస్తుత రచనకు వస్తే, ఇక్కడ చెప్పుకో దగిన అంశం ఒకటి ఉంది. తాత్కాలికమయిన ఆవేశంతో జరిగిన సంక్షోభానికి ఏ మతాన్నీ దూషించకుండా ఆద్యంతమూ కేవలం సైద్ధాంతికమయిన ప్రాతిపదికపై కేవలం వస్తుదృష్టితో కావ్యం నిర్వహింపబడింది.

## II

మొదటి గీతంలో వస్తువులోని చారిత్రక గతిని బట్టి అనివార్యమయిన సంఘర్షణ సూచితమయితే, రెండో గీతంలో సంఘర్షణకు పిలుపు ఉంది. లక్ష్య నిర్దేశమూ ఉంది. నిరంకుశుల కెప్పుడూ వాళ్ళు చేసే పని చెడ్డదని ఏ కోణాన అనిపించదు "Yes! we are barbarians, we want tobe barbarians' హిట్లర్ మాటలు ప్రస్తుత విషమ స్థితికీ అన్వయిస్తాయి. తను వ్యూహంలో వ్యతిరేక పరిస్థితుల్ని ఎదుర్కోవలసి వచ్చినపుడు వీరిలో కార్కశ్యం నైశిత్యం దృఢతరం ఔతుందే తప్ప కారుణ్యమూ వేదన ఉండవు. వ్యక్తుల్లో జడత్వం మౌఢ్యం అంధత్వం వీడేట్లుసంస్కరణం తేవచ్చు. కాని రాజకీయ నిరంకుశత్వంలో పరివర్తన తేవడం దుష్కరమయిన పనే. ఇది అంతం కావడం ఒక్కటే చేయగలిగింది. ఇటీవలి హిట్లర్ పాలనం, నేడు దక్షిణాఫ్రికా ప్రభుత్వం సహితంగా పలుచోట్ల చూడవచ్చు. తుది విజయం మాత్రం అశేష ప్రజల ప్రగతి, శాంతి, సౌభాగ్యంతో కూడిన ఉన్నత ప్రయోజనాలకే సిద్ధిస్తుంది. అయితే దీనికి కావలసినంతగా క్రియాశీలమయిన పాత్రను నిర్వహించేందుకు మానవశక్తి సమీకరణమూ అవసరం. ఇదే గుహానివాసం నుండి, అరణ్య సంచారం నుండి దశలు దశలుగా ఈనాటి నాగరక శిఖరాలకు చేర్చింది. ఇది ఒకచోట నిలిచిపోయేది కాదు. ఒకనాటితో అవసరం తీరేది కాదు. నిరంతరం సాగుతూనేఉంటుంది. దీనికై ఉద్యమమూ వేగాన్ని అందుకోవడమూ ఎంతైనా అవసరం. తెలంగాణా విషయానికివస్తే గాంధీజీ నాయకత్వంలో స్వదేశ పాలనం, స్వాతంత్ర్యం కోసం ఉద్యమించే ప్రజాశక్తుల రాజకీయ ప్రభావం హైదరాబాదు సంస్థానంలోనూ నిబిడంగా ప్రసరించడంతో ప్రజల్లో స్వాతంత్ర్య కాంక్ష ఉద్యమించింది. భవిష్యత్తును నిర్ణయించుకొని ప్రధాన ప్రవాహంలో కలిసేందుకు ప్రేరకమయింది. అందుకే స్వాతంత్ర్యం- స్వేచ్ఛ- మానవత అనే వాటికి సంబంధించిన ఆలోచనలు ఉద్యమాలు దేశ సీమల్ని దాటి ఎక్కడ మానవుడు ఉంటే అక్కడికి నిరాటంకంగా ప్రసరిస్తాయి. అతనిలో గుప్తమైన శక్తిని ప్రజ్వలింపజేస్తాయి.

"కదలండి కదలండి కదలి పోరాడండి
కాకతీయుల శౌర్యపటిమ చూపించండి"

వర్తమాన పోరాటానికి వీరగాథల సంఘటనలు ప్రేరణగా స్వీకృతమయినాయి. గీతం ఆరంభంలో ఈ విధానం అనుసరించడం చేత భావానికి పుష్టి చేకూరుతూంది. వర్తమాన స్థితి విశ్లథం కాకుండా ఉత్సాహాన్ని నిలిపేందుకు జ్వలింపచేసేందుకూ సహకరిస్తూంది. భారతదేశం కొన్ని సంస్థానాలు మినహా అప్పటికి ప్రజాతంత్ర యుగంలోకి ప్రవేశించనుంది. స్వాతంత్ర్యకాంతిని అనుభవిస్తోంది. అక్కడక్కడా ఇంకా మిగిలిన సంస్థానాల్లో హైదరాబాదు ఒకటి.ఇంకా చీకటినే అనుభవిస్తోంది. దీన్ని నిరంకుశంగా ఇంకా నిలిపేందుకు అధికారులు, జాగీర్‌దార్లు, దేశ్‌ముఖ్‌లు "రాజీలు పడి" ఏకమయ్యారు. స్వప్రయోజనాల

కోసం అధికార దుర్గాలను నిర్మించుకున్నారు. 'వీటిని కూల్చేందుకే ఈ పిలుపు !

"కదలి రండి! కదలి రండి! కదలి పోరాడండి"

సమైక్య చైతన్యంతో ఈ కదలిక, పోరాటం ప్రయోజనం చీకట్లను తుదముట్టించి ప్రజలకు కాంతిని దర్శింపజేయడమే.

"తుది తెలుగు మానవుడు
బ్రతుకు పీడిందాక
తుది రక్తబిందువులు
చింది ఒలికిందాక"

వ్యక్తి జీవితాన్ని పోరాటానికి ఆయత్తం చేసే ప్రయత్నంతో ఈ కవితలో తెలంగాణా విముక్తి ముక్కోటి తెలుగుల స్వాతంత్ర్యసిద్ధికి సంపూర్ణత్వం భావితమయింది. తెలుగునేల అంతా ఒకే రాష్ట్రంగా ఒకే శక్తిగా విశాలాంధ్రగా రూపొందాలనే కవి ఆకాంక్ష. ప్రజల్లో పోరాట భావం వచ్చినంతమాత్రాన చాలదు, ఇది క్రియాత్మకం కావాలి. ఇందుకు రాజనీతితో ప్రవృత్తమైన వ్యూహమూ అవసరం. దీన్ని నిర్వహించడానికి సాధన సంపత్తి సహాయమూ కావాలి. ఇవి ఎక్కడినుంచివస్తుంది? అందాకా చేతులు ముడుచుకొని కూర్చొనేందుకి వీల్లేదు. ఏం చేస్తారు మరి? తమ కందుబాటులో ఉన్న కర్రలు కత్తులు వడిశెలు బరిసెలు బల్లాలు ఒకటి రెండు నాటుతుపాకులతో ముందుకు ఉపక్రమించడమే! అదే పని చేసారు. ప్రజాభీష్టానికీ యుగధర్మానికీ వ్యతిరేకంగా నడచిన హిట్లర్, జార్, టోజోలతో సహా ఎందరో రూపు మాసారు. ఇదీ అంతే అవుతుందని కవి అచంచల విశ్వాసం.

"ఖబర్దార్! ఖబర్దార్! నైజాం పాదుషాహే" అని నిరంకుశులకూ పీడకులకూ కవి చేసే హెచ్చరిక! తాను బాధితులూ, పీడతులూ ఐన ప్రజల పక్షాన నిలిచి గతానికి మతానికీ అతీతంగా మానవుణ్ణి విశాలదృష్టితో వర్తమాన తలంపై నిలిపిన తీరు ముఖ్యమయింది. కవి అంతర్జాతీయమయిన దృక్పథానికి మానవీయమయిన అనుబంధానికి నిదర్శనమయింది. హిందూ, ముస్లిం క్రైస్తవ— ఏ మతం వాడైనా సరే మానవత్వంతో పరిమళించడమే అతనికి కావలసింది. మతం ప్రాంతం కన్నా ఈనాడు ప్రజలు ఎదుర్కోవలసిన దుస్థితిని తెచ్చిపెట్టిన మౌలిక తత్త్వాన్ని నిరసిస్తాడు. దీన్ని ప్రతిబింబించే నిరంకుశుల దుష్పరిణామాల పట్లనే అతని ఆక్రోశం! ఈ దృష్టి ఒకచోట మార్క్సిజం వెలుగులో ఉండవచ్చు, ఇంకొకచోట మానవతావాదంతో ప్రతిధ్వనించవచ్చు.

"హిందూ ముస్లిం పీడిత
శ్రమ జీవు లేకమైరి"

అనే ధోరణి హర్షింపదగింది. నిఖిల మానవసంస్కృతి భవిష్యత్తుపై విశ్వాసం గల ఉత్తమ రచయిత చేసే పనే ఇది. ప్రజలంతా మతభేదాలు విస్మరించి మానవతా రాగంతో ఏకమై తముపై ప్వారీచేసే నిరంకుశ శక్తిపై సలిసే పోరాటం చేత ఎందరో అసువులు బాసారు. వారితో సూర్యాపేట, బాలెం వీరులూ, జనగామలో అమరుడైన దొడ్డి కొమరయ్య (కడివెండి) అనంతయ్య పేర్కొబడినవారు.

"ఒక వీరుడు మరణిస్తే
వేలకొలది ప్రభవింతురు
ఒక నెత్తుటి బొట్టులోనె
ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు"

ఒకే ఒక ఎత్తిన పిడికిలితో, మ్రోగే కంఠంతో ఒకే ఒక లయతో శబ్దించే గతితో, కదలే ప్రజాశక్తికి, నిరంకుశ ప్రభుత్వం భయకంపితం కాకపోదు. సింహాసనం కదలకపోదు. అమానుషత్వాన్ని, నిరంకుశత్వాన్నే "గోరీల్లో పాతేసి" "విశాలాంధ్ర ప్రజాస్వామ్యం" అవతరణకై, సంరంభంతో కదలిపోయే

జనశక్తిలో కవి ఐక్యమై పలకడం ఇందులో విశేషం. హెచ్చరికతో ఆరంభమై, ఆశ్యాన్ని సాధింపగోరే క్రియారూపంతో ముగిసిన ఈ యాత్ర, ఆదర్శం 'విశాలాంధ్ర' స్థాపనం.

నాలుగు ఐదు భాగాల్లో ప్రజల కార్యాచరణం వల్ల ప్రభుత్వ వ్యవస్థ తీవ్ర సంక్షోభాన్ని పొందడం చిత్రిత మయింది. అయితే చరిత్ర గతి వేగంతో మార్పుకు రంగాన్ని సిద్ధం చేయడమూ జరిగింది. హత్యలు, మానభంగాలు, హింసలూ ఒకటేమిటి? దుష్కృత్యా లనేకం! ఒక్కొక్క ఉదంతం కథనమే ప్రధానమను కుంటే ఒక్కొక్క ఖండంగా వ్రాయదగినవి, కవి శిల్ప దృష్టి వేరు కావడంచేత ఇందులో ప్రాతినిధ్యాన్ని వహించే కొన్ని సంఘటనలు ఫోటోగ్రాఫీ టెక్నిక్‌తో ఆయా భాగాలు ప్రభావోపేతంగా చిత్రితమయినాయి. మొదటి నుండీ చివరి వరకూ ఇందులో అణచిన కొద్దీ పైకెగసే, కాల్చిన కొద్దీ ఎర్రని బింబమై జ్వలించే వీర రూపం ఆవిష్కృతమయింది. భౌతిక సుఖాలనూ సంపదలనూ వదలి దేశభక్తితో దీక్షా కవచంతో యువశక్తి శ్రమించింది. ఇది ఏ మాత్రమూ కల్పన కాదు కేవలం జరిగిన కథ. సమకాలీనమయింది "అతడెవరు? అతడెవరు?" అని ప్రశ్నలతో పున రుక్తితో ఎత్తుగడ ప్రభావ చకితమైన ఆరంభం భావు కుల్ని వ్యగ్రమనస్కుల్ని చేస్తుంది. జనగామలో జమ్మి చెట్టు కొమ్మపై తెలంగాణ గెరిల్లా నాయకుడు గాండీ వాన్ని వెదుకుతూన్న విజయుని వలె ఉన్నాడు. ప్రజా సమరానికి ఆయత్తమౌతూ "ప్రజాస్వామ్య జగతి కధ్యాపకుడై" పాంచజన్యం పూరిస్తున్నాడు, పాత్ర వ్యక్తిత్వాన్ని ఉజ్వలంగా గాఢంగా ప్రకాశింప జేసేం దుకు పూర్వగాథల ప్రసక్తి ఈ రచనలో చాలాచోట్ల రాణిస్తూంది. ఊదిన కొమ్ము బూరా ధ్వనికి అవని గర్జించింది."శత్రువులు వస్తున్నారు ప్రజలు నడుములు బిగించి నిలవండి గెలవండి" అన్న శబ్ద తరంగిత మయింది, శత్రువులు రానే వచ్చారు. పెట్రోల్‌తో ఇళ్ళు తగలబెడుతున్నారు. ఆధునిక ఆయుధాలతో దాడి చేస్తున్నారు. ఒక వైపున లేళ్ళ నెత్తురు తాగిన, బెబ్బులులు" మరో వైపున స్వేచ్ఛామృతం త్రావి! అమరులే ఉత్సాహ మూర్తులూ! అదొక ప్రపంచం ఇదొక ప్రపంచం! ఇరువురి మధ్య సంఘర్షణ తీవ్ర తరమైంది. విప్లవాగ్ని రగిలింది. జనగామ 'ఘోరమై బీభత్స దృశ్యమై పైశాచ భోగ్యమై' రూపొందింది. పసిగుండెల్ని పిండీ, మొగ్గల్ని నులిమేసీ, రేకుల్ని నలిపేసీ! అంతా! దైన్యాకృతి వహించింది. విప్లవ ప్రవాహం సాయుధ తరంగాలతో పొంగింది. ఎదురు దాడికి సిద్ధమైంది రైతులు కూలీలు బాధితులు పీడి తులు అంతా కదలారు. ఈటెలతో బల్లాలతో రోక ళ్ళతో కారాల మూటలతో! వీరిలో నుండి అతడే! ఆ కల్పించిన నాయకుడు! ప్రళయకాల రుద్రమూర్తియై అవతరించాడు. హత్యనూ, మృత్యువునూ జయించి చివరకు 'విజయు'డైనాడు. ఈ చారిత్రక సంఘటన రచనలో ఒక కరుణ వీర కళాత్మకంగా మలచుకొని నిలచింది,

నాలుగో గీతం ఐదో గీతంలో వస్తువు ఒకటే అయినా నిర్వహణంలో వైవిధ్యం ఉంది. ఐదో గీతం అన్నిటికంటె పెద్దది. 'నూతన వసంత శర్వరీ చంద్రిక'లో గుండెల్లో 'ఎర్రని అభిమానం' తొణికిస లాడుతూ ఎగిరే పతాకలు! కాల్పనిక స్పర్శతో వర్ణనా భణితిలో నిర్మితమయిన ఈ దృశ్యం, యథార్థానికి ఏమాత్రం దూరమయింది కాదు. కవి రాజకీయ సిద్ధాంత రాగ రూపాన్నే భావింప జేస్తూంది. వివిధ సంఘటనలూ మధ్య మధ్య ప్రవేశించే పాత్రలూ మధ్య మధ్య అభిభాషణలతో భిన్నమయినసంవిధానం కలిగింది. ఈ 'భయ సమయం'లో 'రాత్రి విశ్వాసం' కూడా మంథగించింది.

'అన్నలార! అదుకోండి! ఆనందం పంచుకోండి' అని నిస్సహాయంగా కీచురాళ్ళు స్వనిస్తున్నాయి! ప్రజల రక్షణకై రాత్రి జాము, ఊరు పహరా కాస్తున్నాడు, అరేండ్ల బాలుడు! 'బాలచంద్రుని సోదరుడు, రుద్రమాంబ తోబుట్టువు', ఇంతలో ఫెఠీలుమని శబ్దం! అదే! ప్రమాద సూచకం! పసిగొంతులో నుండి కంచు స్వరం దూకింది. భయం బద్దలైంది! ధైర్యం కవచమయింది. పౌరుషాగ్ని జ్వలించింది, 'కామ్రేడ్స్'ను ఉజ్జ్వలింపజేయడం కోసం! సింగపు కొదమలు కొండపైకి చేరాయి! మూడు తుపాకులు ప్రేలాయి చీకట్లో కలిసారు, గుత్తాలూ గూండాలూ! అంతలోనే తమ వైపే గురి పెట్టిన రైఫిల్ జ్వాలలు! చేతిలో తుపాకి! తూటాలు అయిపోయాయి. అభిమన్యుల వలె తెలుగుతల్లి కడుపు శోకం మిగిల్చి నూరేండ్ల పచ్చని బ్రతుకులు ధూళిలో కలిసాయి.... తుది ఘడియల్లో వారిచ్చిన సందేశం, 'తల్లీ ఏడవకమ్మా నీ దాస్య విమోచన కంకణు లున్నారమ్మా!' కరుణాత్మకమయిందీ, ఉత్సాహదీపితమయిందీ, యశశ్శరీకుల అంతరాత్మలు తెలుగుజాతి శరీరానికి 'ఉక్కు కవచమయింది' 'రక్షా బంధన'మయింది. 'దీక్షా కంకణ'మయింది. 'ప్రాణజ్యోతి' అయింది. అపూర్వ సమాహిత శక్తితో పిడికిలి బిగించి పోరాటానికి సిద్ధమయింది మహాప్రజ! జాతి అమరత్వాన్ని స్ఫురింపజేసే ఆశాసంభరితమయిన భావదృశ్యంతో ఈ సంఘటన సమాప్తమయింది, ఇక్కడ వస్తువులోని స్థితి క్రమం, సంఘర్షణ నాశ్రయించి, పాత్రలకు దీప్తిని చేకూర్చుస్తుంది. దీనికి పాత్రల అభిభాషణం ఉపస్కృతమై కవిత్వ పరిధిని పెంచుతూ కవి నిర్వహణ శిల్ప సామర్థ్యాన్ని భావింపచేస్తుంది!

ఏ దేశంలోనయినా రాజకీయ స్వాతంత్ర్యం కోల్పోయిన వారంతా బానిసలే! మొన్నటిదాకా భారత దేశం! నిన్నటి దాకా, అంతర్భాగం తెలంగాణా! ఇంకా నేటికీ దక్షిణాఫ్రికా! అయితే ఈస్థితిలో నున్న వారంతా ఒకటై, మానవులై యోధులై ఆయుధాలు ధరించి ఒకే ఒక గొంతుకతో కదలవలసిన అవసరాన్ని గుర్తించడం వారి ప్రథమ కర్తవ్యం.

"మా చేతుల బంధించిన గొలుసులు
మంచు బిందువులై నేలపడును"

ఆత్మవిశ్వాసంతో ముందుకు నడిచే వారిలో మెలకువ ధైర్యమూ లక్ష్యమూ చెదరిపోక, నిలవడంతో ఆశ బలపడుతుంది. ఈ స్థితి 'గాఢ నిద్రలో నుండి సింహాలు జూలు దులుపుకొని మేల్కొన్న విధంతో అలంకృతమయింది. నరనారీ దళాలు సుశిక్షిత మేరువులై ఎక్కుపెట్టిన ధనుస్సులై చేసే వీర సంచారం దళాలు దళాలుగా సాగే స్థితిని బట్టి అవ్యుత్తమై నిర్వహణౌచిత్యాన్ని పెంచింది. రణ కర్కశ బీభత్సంతో సంఘర్షణ శిఖరభూతమయిన స్థాయి నందుకుంది. అయినప్పటికీ, ప్రజల్లో కొత్త పంట ఫలిస్తూ కొత్త స్వరం స్వనిస్తూ మునుముందు రోజులు వస్తాయన్న ఆశా బంధురంగా ఆలోచన రూపొందింపబడింది. 1945-46 నుండే నల్లగొండ జిల్లా నియంతలకు వ్యతిరేకంగా సుశిక్షిత వ్యవస్థతో రూపొందింది. కూలీలు రైతులూ పేద జనం సమీకృతమై ప్రజా పరిషత్తుల్ని ఎన్నుకొని పంచాయతి పాలన మొదలైంది. ప్రభుత్వ వ్యవస్థ భగ్నమయింది. భూమిపై సంపద అంతా అందరూ సమానంగా పంచుకోవాలనే భావమూ వ్యాప్తిచెందింది. సమాజంలో కొత్త ఆలోచనలు ఎదగడం మొదలు పెట్టాయి. దీనికి తగిన ప్రయత్నాలు మొదలయ్యాయి. నల్లగొండ 'తెల్లని మబ్బులతో' వహించిన ఆశారూపం క్రమంగా 'సాగరం వలె ఉప్పొంగి' తెలంగాణంఅంతా వ్యాపించడం మొదలుపెట్టింది. కామ్రేడ్స్ విజయసూచకంగా ప్రజా స్వాతంత్ర్యాన్నీ సౌభాగ్యాన్నీ విశ్వ శాంతినీ కాంక్షించే కవి మనస్సులోని యువశక్తి సమాజశక్తికి సంకేతమయింది. కష్టజీవుల్ని పీడితుల్ని బాధితుల్ని కదిలించి ఉత్సహింపచేసే చైతన్యరూపమయింది.

"బానిసత్వపు బరువు ఛేదించి
మానవత్వపు తెరువు చూపించి'

క్రొత్త ఉదయాన్ని కొత్తయుగాన్ని భావింపజేస్తూంది రచన.

ఈ కావ్యం అభ్యుదయ కవిత్వ పరిణామంలో నిర్వహించిన చరిత్రాత్మకమయిన పాత్ర విస్మరించ రానిది. తెలుగు, తెలంగాణా, విశాలాంధ్ర భావనతో పర్యాప్తమయినప్పటికీ, ఇది స్వాతంత్ర్యం— సమ సమాజం ఆదర్శంతో రూపొందింది. మతం—ప్రాంతం అనే సంకుచిత సీమల్ని అధిగమించి, అంతర్జాతీయ రాజకీయ తత్త్వంతో మానవత కంకితమయిందీ, కవి జీవించి ఉన్న కాలంలోని చరిత్రాత్మకమయిన సంఘ టనలకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో స్పందించి ఒక ఆదర్శంతో అవతరించిన సృజనాత్మక శిల్పం, ఉజ్జ్వలమయిన సాహిత్య వ్యక్తిత్వంతో చరిత్రలో విడ దీయరాని వాస్తవానికి చిరరూపం సోమసుందర్ ఉత్తమకృతి బానిసల దండయాత్ర.

ప్రొఫెసర్,
క్వార్టర్ నం. 14,
విద్యారణ్య పురి,
కాకతీయ యూనివర్సిటీ,
వరంగల్-506009.

# ఉగాది పండుగ

— బతా చంద్రయ్య

తెలుగు గుండెలో వెలుగులు చిలికే
ఉగాది పండుగ వచ్చింది
ఆశల పొంగులు నింపింది

ప్రకృతి నవ్వుల పువ్వుల జల్లులు
పులకింతలు పూయించినది
లేమావిపై వసంత కోయిల
పసందుగానము చేసింది
మయూరముల పురికొలిపింది —॥తె॥
పచ్చడి చెప్పే పరమార్థాలను
పలుమారులు విడమరిచింది
కష్ట సుఖమ్ములు గావడెద్దులని
కమ్మగ పాఠం నేర్పింది
కరాఖండిగా చెప్పింది —॥తె॥

ఆమని విసరిన అందాలన్ని
అవని జనులకొక తీపిరుచి
అంచనాలను వంచన చేసే
బడ్జెట్ పిడుగె చేదు రుచి
బదులు లేని ఒక ప్రశ్న అది ॥తె॥
అంబరవీధిన అడుగిడ నేర్చిన
ధరవరలే ఒక వగరు రుచి
అంత కంతకూ మండే ఎండలు
గుండెలు పిండే పులుపు రుచి
గంగ నిర్దయకు సమయమది —॥తె॥

అసిస్టెంట్ పోస్టుమాస్టర్
ఇం నెం 4-4-41
షైర్‌పురా-సిద్దిపేట.

# మార్గదర్శి గురజాడ అప్పారావు గారు

— శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

(ఈ వ్యాసం శ్రీ మానేపల్లి పంపగా వారి పరిచయ వాక్యాలతో బాటు ప్రకటిస్తున్నాము.) — సంపాదకుడు

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు (1891-1961) ప్రాచీనులలో నవీనుడు. కాదు-అత్యంత నవీనుడు. భాషలోనే కాదు, భావాల్లో ఆయన్ని అభ్యుదయ వాదిగా చెప్పుకోవచ్చు. కేవలం తెలుగు, సంస్కృతం మాత్రమే క్షుణ్ణంగా నేర్చి, ఆంగ్లభాషా ప్రభావం ఎంత మాత్రమూ లేకుండా అనేక 'గొప్ప' కథలు రాశారు.

1946 లో రాజమండ్రిలో జరిగిన గురజాడ అప్పారావు గారి సంస్మరణ సభలో శ్రీపాదవారు ప్రసంగించారు. ఆ ప్రసంగ పాఠాన్ని వ్యాసంగా రూపొందించి పంపగా, అది నవోదయ (వారపత్రిక. సంపాదకులు : నీలంరాజు వేంకట శేషయ్య ?) డిసెంబర్ 1946 సంచికలో అచ్చయినది.

శ్రీపాద వారు తాము గురజాడ వార్ని చూశామని చెప్పారు. ఆ చూసింది కాకినాడలో ఆంధ్ర సాహిత్య పరిషత్తు సభలో. నేను పరిశీలించినంతలో- ఆ సభ 1914 లో జరిగింది. ఆ సంవత్సరమే గురజాడ వారు మద్రాసు విశ్వవిద్యాలయానికి తమ డిసెంట్ పత్రాన్ని సమర్పించారు. వ్యావహారిక భాషా ఉద్యమ చరిత్రలో 1914ఒక అతిముఖ్యమైన సంవత్సరం. ది హిందూ పత్రికలో ఆంగ్లంలోనూ, ఆంధ్ర పత్రికలో తెలుగులోనూ పుంఖానుపుంఖాలుగా వాద ప్రతివాదాలు వెలువడ్డాయి. ఈ వాద ప్రతివాదాలను కాకినాడ లోని 'స్కేప్ అండ్ కంపెనీ' వారు Arguments for and Against Modern Telugu అనే పేర పుస్తకంగా ప్రచురించారు. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారు 'సాహిత్య ఊహ' తెలిసినప్పటి నుంచీ ఖచ్చితమయిన వ్యావహారిక భాషావాది.

ఈ వ్యాసంలోని చివరి వాక్యం 'వచన రచయితలు మాత్రమే అప్పారావు గారి మార్గదర్శకత్వం స్వీకరించారు. పద్య రచయితలు ఆ దారి పట్టుకోలేక పోయారు' అనే మాట నేటికీ నిజమే. 1982 లో రాజమండ్రిలో జరిగిన గురజాడ సంస్మరణ సభలో చింతా దీక్షితులు గారు కూడా ఇదే అభిప్రాయం వ్యక్తపరిచారు.

'నిజంగా జానపద సాహిత్యం యిచ్చిన పు త్తేజంతో గురజాడ రచనలు చేశారు. నాది ఎక్కువగా పట్టణపు జీవితం అవడం మూలాన ఆ బాటలో సూటిగా నడవలేకపోయాను' అని శ్రీశ్రీ స్పష్టపరిచారు ఒక సందర్భంలో, గురజాడది కవిత్వంలో మౌఖికసంప్రదాయమనీ, అది ప్రజలకు మరింత చేరువైందనీ వెల్చేరు నారాయణరావు గారు తమ 'తెలుగులో కవితావిప్లవాల స్వరూపం' (1978) లో సోదాహరణంగానూ విపులంగానూ నిరూపించారు. విప్లవకవుల పాటలు గురజాడ సంప్రదాయాన్ని సరిగ్గా అంది పుచ్చుకున్నాయని, శ్రీశ్రీ వర్ధంతి సభలో కలిసినపుడు- ఒక ప్రయివేట్ సంభాషణలో కాకరాల గారు సోదాహరణంగా వివరించారు.

ప్రస్తుత వ్యాసం— గనూరు రమేష్‌బాబు పూనికపై వెలువడిన దక్షిణ ఢిల్లీ ఆంధ్ర సంఘం వారి గురజాడ సంస్మరణ సంచికలో (1976) పునర్ముద్రణ పొందింది. అయినా ఇటువంటి సంచికలు బహు కొద్దిమంది సాహిత్య పాఠకులకే అందుబాటులో వుంటాయి గనుక సామాన్య పాఠకులు యావన్మందికీ అందుబాటు లోకి తీసుకు వచ్చేందుకు దీనిని సమర్పిస్తున్నాను.

— మానేపల్లి

సద్ధర్ములకు మహాపురుషులెప్పుడూ జ్ఞాపకం వస్తూనే వుంటారు. అయినా సంవత్సరానికొక్కమాటు వారిని ప్రత్యేక శ్రద్ధాసక్తులచే స్మరించుకోవడం వారి అడుగు జాడల్లో నడిచేవారికి మిక్కిలి శ్రేయస్కరం. అది సభ్యతకు చిహ్నమున్నూ.

ఈ దృష్టితో ఈవాళ నేను గురజాడ అప్పారావు గారిని విశిష్ట భక్తితో స్మరించుకొంటున్నాను.

బతికి వుండిన దినాల్లో వారిని ఆంధ్ర ప్రజానీకం గుర్తించలేకపోయింది. కాని, తరువాత మాత్రం సంవత్సరం మీద సంవత్సరం గడిచిన కొద్దీ వారివిషయమై ఎక్కువ తెలుసుకుంటోంది. వారి రచనల కోసం ఆత్రులు చాపుతోంది. అవి చదివి ఆనంద ముగ్ధం అవుతోంది. ఆ వెంటనే 'యెలాంటి పెన్నిధిని గుర్తించలేకపోయామా?' అనిన్నీ పరితపిస్తోంది.

అసలే ఆంధ్రజాతికి ఆత్మగౌరవము, ఆత్మ విశ్వాసమూ ఇంకా గుర్తు రాలేదు. దీనికి సాయం అప్పారావుగారు అసందర్భ పరిస్థితుల్లో బతుకవలసి వచ్చింది.

అప్పటికే కాదు. ఇప్పటికి కూడా, సారస్వత నిర్మాతలకూ ఆంధ్రదేశంలో స్వతంత్ర జీవన మార్గాలేర్పడనే లేదా మరి.

మనవాళ్ళు, ఇప్పుడిప్పుడు, కొందరు కొందరు రచయితల విశిష్టత గుర్తించి ఆదరించటం నేర్చుకుంటున్నారు. ఆదరించడం అంటే, మెడలో ఒక పూలదండ వేయటం, కొన్నిచోట్ల ఒక ఖద్దరు దుప్పటీ భుజాల మీద కప్పటం ఇంతే. అంతేకాని, ఆ రచయితలు నౌకరీ చేసే పొట్ట పోసుకుంటున్నారో, అదీ చేతకాక, పస్తే వుంటున్నారో యెవరూ యోచించటం లేదు.

కొందరు రచనలు ఆనందం కలిగిస్తున్నాయనుకుంటున్నారే గాని అలాంటి పుస్తకాలతోనే సాహిత్యం ఉన్నతి పొందుతున్న దనిన్నీ ఉన్నత సాహిత్యం సంపాదించుకున్న జాతే స్వేచ్ఛానందా లనుభవించ గలుగుతుందని కూడా వారు గుర్తించలేదు.

ఇప్పుడే, కవుల కర్తవ్యం వేరూ, జీవన విధానం వేరూ అయివుండినప్పుడూ, సాహిత్య విషయాలలో

కూడా అడివి ఛేదించి కొత్త మార్గాలు నిర్మించుకోవల సిన అప్పారావు గారి కాలంలో, రచయితలను గుర్తించే పద్ధతే లేదని వేరే చెప్పడం ఎందుకూ?

అయితే సుగంధ పుష్పాలు ఆస్వాదించేవారి కోసం యెదురు చూడవు. కీకారణ్యంలో ముళ్ళ డొంకల్లో కూడా అవి పుడుతూనే వుంటాయి.

అది సృష్టి రహస్యం

ప్రకృతం—

ఒక మనుష్య స్త్రీ అప్పల కొండమ్మ, తన సొంతానికి ప్రయివేటు శ్రుకటరీగా వాడుకోగా సరిగా ఆ సమయంలోనే ఒక దేవతా స్త్రీ సరస్వతీ దేవయమ్మ. బహుళాంధ్ర కోసం మహాకవిగా తీర్చిదిద్ది- అధునికాంధ్ర సాహిత్య సామ్రాజ్యంలో కిరీట మాంధాతను చేసింది.

ఇది సూక్ష్మంలో, అప్పారావు గారి చరిత్ర విస్తరించి చూస్తే అప్పారావు గారి దగ్గర లౌకిక ప్రజ్ఞ అపారంగా వుండినట్లు కనబడుతుంది. వైదిక సంపత్తి కూలంకషంగా వుండినట్లు గోచరిస్తుంది. ఆర్ష విభూతి అనన్య సాధారణంగా వుండినట్లూ ద్యోతకం అవుతుంది.

ఈ మూడు శక్తుల సమ్మేళనం వల్లనే అప్పారావు గారు మహాకవులై, మనకు అలౌకికానందం కలిగించగలుగు చున్నారు.

ఆదికాలంలోనే నన్నయ భట్టారకునకు కలిగిన యోగ్యత ఇది. తరవాత కొద్ది కాలానికే తిక్కయజ్వకును సంక్రమించిన విశిష్టత ఇది? కాని, ఇది మళ్ళీ ఆంధ్రజాతిలో జాజ్వల మానం కావడానికి ఇంత కాలం పట్టింది.

దేశం ఎంతగా పరుల పాదాల క్రింద నలిగిపోవాలో అంతగాను నలిగిపోయాకా, జాతి ఎంతగా బానిస అయిపోవాలో అంతగాను అయిపోయిన తరువాత భాష ఎంతగా శృంఖలాబద్ధం అయిపోవాలో అంతగాను శృంఖలాబద్ధం అయిపోయాక, సాహిత్యం ఎంతగా దిగజారిపోవాలో అంతగాను దిగజారిపోయాక భవిష్యత్తు ఎంతగా అంధకార బంధురం అయిపోవాలో అంతగాను అంధకార బంధురం అయిపోయాకా పుట్టుకు వచ్చాడీ మహాకవి.

ఆశ్చర్యపడటానికేమీ లేదు. ఏమంటే నిజానికి ఇలాంటి పరిస్థితుల్లోనే తరచూ ఆదర్శ పురుషు లావిర్భవిస్తూ వుంటారు.

అయితే అలాంటి నికృష్ట స్థితిలో మహాకవి అయితే మాత్రం నరసేవ చెయ్యకుండా భుక్తిఎలాగడుస్తుంది. ఆ పురుషుడు చెయ్యి జారిపోకుండా జాతి మాత్రం అతని మహత్తు ఎలా గుర్తించగలుగుతుందీ?

అయితే అప్పారావు గారికి మాత్రం తమ సత్తా బాగా తెలుసు- ఒకచోట-

'తూర్పు బలబల తెల్లవారెను
తోకచుక్కయు వేగుచుక్కయు
ఒడయు దౌ వేవెల్గు కొలువుకు
వెడలి మెరిసిరి మిన్ను వీధిని'

అన్నారు వారు.

తోకచుక్క విచ్ఛిత్తికి సూచకం. వేగుచుక్క మహోదయానికి సూచకం నిజమే కాని ఈ తోక చుక్క ఏమిటి? ఇది చేసిన వినాశం ఏమిటి? ఈ వేగు చుక్క ఏమిటి? దీని తరువాత జరిగిన మహోదయం ఏమిటి? అందే వక్ష్యవాక్కులు శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు గిడుగు రామ్మూర్తి పంతులు గారే తోక చుక్క యని, గురజాడ అప్పారావు గారే వేగుచుక్క అనీ వ్యాఖ్యానం చేశారు.

రామమూర్తి గారు చేసింది కృతక భాషా విధ్వంసనమేగా? అప్పారావుగారు చేసింది కవికుమార కళ్ళకు వెలుగు కలిగించడమేగా?

అందుచేతనే మిత్రులు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిలు వారు, అప్పారావు గారిని, 'గురజాడ వాల్మీకి' అని వ్యవహరించారు.

నేస్తం భమిడిపాటి కామేశ్వరరావు గారు 'స్వయం జ్యోతి'అనీ, 'ప్రథమాంధ్ర రచనాబ్రహ్మ' అనీ కీర్తించారు,

అయితే ఈ మిత్రులిద్దరూ ఆ మహాకవిని ప్రత్యక్షంగా చూసి ఎరుగరు

నాకు మాత్రం ఆ మహాభాగ్యం పట్టింది.

ఒక్కమాటే పట్టింది.

కాకినాడలో, ఆంధ్ర సాహిత్య పరిషద్వార్షికోత్సవం జరిగింది. అప్పటికా నగరంలో ఇప్పటి టౌనుహాలు లేదు. అంచేత ఆ సమావేశం మునిసిపల్ ఆఫీసులో జరిగింది.

తొలినాడు కిళాంబి రామావతారం గారు మరునాడు పిఠాపురం మహారాజులుంగారు అధ్యక్షత వహించి కార్యక్రమం నడిపించారు.

ఆ కార్యక్రమం ఏర్పరచినవారు పైనే ఉండి సర్వమూ పర్యవేక్షణ చేసినవారు మాత్రం జయంతి రామయ్య పంతులు గారు.

అధ్యక్షులిద్దరూ రామయ్య పంతులుగారి ఇంగితం గుర్తించుకుంటూనే కార్యక్రమం నడిపించారు.

మరునాటి పొద్దటిపూట కొన్ని తీర్మానాలు జరిగాయి. ఆ సందర్భంలో గిడుగు రామ్మూర్తి పంతులు గారు వ్యవహారిక భాషావాదం ప్రతిపాదించగా గురజాడ అప్పారావు గారు బలపరిచారు,

అప్పటి కీఇద్దరే వ్యావహారిక భాషావాదులు.

మహా పండితులు తాతా సుబ్బరాయశాస్త్రిల వారు పేరి కాశీనాథ శాస్త్రిలవారు కూడా అప్పుడా సభలో వుండినారు.

అయితే, అప్పటికి వారు పూర్తిగా మారినట్లు జ్ఞాపకం లేదు. కాని వారు; వ్యావహారికం యెత్తిరించిన పురాణపండా మల్లయ్యశాస్త్రి గారి (లిఖిత) గ్రాంధికో పన్యాసంలో అడుగడుగునా తప్పులు పట్టడం మాత్రమే నాకు బాగా జ్ఞాపకం వుంది.

ఉద్యోగధర్మం పురస్కరించుకునేకాక పాండిత్యం పురస్కరించుకొనిన్నీ వారు, అప్పారావు గారిని చాలా ఆదరంగా చూసేవారు. తెల్లటి పంచే, నల్లని పొడుగు కోటు, ఆ కోటు మీద పరిణత వయస్కతకు సూచకంగా తిలతండుల న్యాయంగా వుండిన గుప్పెడేసి మీసాలు పట్టి పల్లారుస్తున్న దీర్ఘ్యవ్యాధికి గుర్తుగా, కాని దూసుకుపోయే చురుకైన చూపులు.

ఇదీ, ఆ ఒక్కమాటే నేను చూసిన ఆ మహాకవి మూర్తిమంతం.

అప్పటి సమావేశం అంతటిలోనూ ఒక్క అప్పారావు గారి ఆకృతే విలక్షణంగా ఉండింది. అందుకు తగ్గట్టు ఇప్పటి ఆంధ్ర సాహిత్యం అంతటి లోనూ ఒక్క అప్పారావు గారి రచనలే విలక్షణంగా వున్నాయి.

ఏమంచ—

ఉబ్బసంతో ఒగర్చుకుంటూ, కుర్చూ దగ్గుకుంటూ అప్పారావు తీర్మానం బలపరిచి 'నేను బలపరిచాను' అని రామమూర్తి పంతులు గారి చెవిలో నోరుపెట్టి ఇంగ్లీషులో గట్టిగా కూడా చెప్పారు.

ఆ భంగిమ చూసీ, ఆ మాట వినీ, వ్యావహారిక వారులు వారిద్దరే కావటం గుర్తించీ. ఆ వాదమున్నూ వినివుండిన గ్రాంధిక వాద ప్రముఖులు ఎగతాళి చేశారు.

వారి ననుసరించి యువక రచయితలున్నూ చాలా మంది నవ్వారు.

ఒక క్షణం దాటితే నేనూ వారిలో చేరిపోయేవాణ్ణే కాని నలుగురితో బాటు నవ్వవలసి వుండిన్నీ, నవ్వబోయిన్నీ, చివరకు నవ్వలేకపోయాను. కారణం నా గురువర్యులు వేదుల రామకృష్ణశాస్త్రిలు గారి మందలింపు.

'వారిద్దరూ మహాపండితులు, వారిని న్యూనత పరచటం మనకి క్షేమం కాదు. వారి వాదం వినడం-

చేతనయితే యెదిరించడం. యిది- మనం చెయ్యవల సింది' అన్నారు శాస్త్రిలవారు, ఆకతాయి నయి పోకుండా నన్ను వారిస్తూ.

రామకృష్ణ కవుల ఇద్దరిలోనూ వెంకటరామశాస్త్రి గారిది సత్యం గ్రహించే తత్వం, రామకృష్ణ శాస్త్రిం వారిది సత్యం ఆచరించే స్వభావం.

నేను గట్టిగా చెప్పగలను.

రామకృష్ణశాస్త్రిల వారు బతికి వుంటే వ్యావహా రిక భాష స్వీకరించే వుందురు.

ఏతావాతా:

నెల్లూరు జిల్లా సాహిత్య చక్రవర్తి గునుపాటి యానాదిరెడ్డిగారు నా ప్రక్కనే కూచుని వుండినారు. వారు వేదం వేంకటరాయ శాస్త్రిలు వారికి శిష్యులూ, కుడిభుజమున్నూ.

రామకృష్ణశాస్త్రిలవారు చెప్పింది విని 'అదీ మాట' అన్నారు రెడ్డిగారు తర్జనితో టోకా యిస్తూ

ఏమయినా పది కాకుల్లో ఒక కోకిల, రాజవీధిని దర్జాగా వెడుతున్న మదగజం- ఇదీ- ఆ క్షణంలో అప్పారావు గారి స్థితి.

వారి మొగాన చిరాకు అలుముకొని వుండింది; వారి చూపులు మాత్రం 'తొందర పడవద్దు' అని దెకారిస్తు న్నట్టున్నాయి.

అది నిజమే అయ్యింది.

అప్పట్లో ఆంధ్ర సాహిత్య పరిషత్తు ఏకైక సంస్థ.

సరికొత్త నిర్మాణం.

మినమినలాడిపోతోంది.

అందరూ ఎగబాకారు; కాని ఇప్పుడు?

గిడుగు రామమూర్తి పంతులు గారి తీవ్రప్రచారం తోనూ, అప్పారావు గారి అమర రచనల తోనూ, భాషాకాశం మీది కారుమబ్బులు విడిపోయాయి.

సత్యం అవగాహన అయింది.

శబ్దశక్తిన్నీ తెలిసివచ్చింది.

దాంతో యువక రచయితలు ఆ ఏకైక సంస్థను విడిచిపెట్టి చక్కా వచ్చేశారు.

ఒక్కొక్కరు గానూ, గుంపులు గుంపులుగాను వ్యావహారికం లోనే బయలుదేరుతున్నారుగా?

ఇంకో విశేష మేమిటంటే?

ఇప్పటికీ గ్రాంధికం విడిచి వ్యావహారికంలోకి వచ్చినవారు వస్తున్నవారు, ఎందరో ఉన్నారు.

ఇంతేకాదు. ఊగిసలాడుతున్నవారు, రావలసిన వారు కూడా చాలామందే ఉన్నారు. కాని, వ్యవహారికం విడిచి గ్రాంధికంలోకి వెళ్ళినవారు, వెడుతున్నవారు, వెళ్ళదలచిన వారూ ఒక్కరూ లేరు.

అది సత్యం అని గుర్తించి అయినా, అవిధంగా కూడా శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిం వారికి ప్రాతి కూల్యం వహించడాని కయినా, యెనభై యేళ్ళ వృద్ధు గ్రాంధికంలో అపారంగా గ్రంథాలు సృష్టించిన నిత్య రచయిత- చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిల వారు కూడా చివరికి వ్యావహారికం అవలంబించి, అతి రసవంతంగా వచన రచన సాగిస్తున్నప్పుడు ఇక దీని కేమి నిద ర్శనం కావాలి?

సారస్వత ప్రీతి గల యిప్పటి యువకులు గ్రాంథిక రచనలు చదవడానికి కూడా యిష్టపడలేక పోతున్నారు గదా, మరో నిదర్శనం చెప్పడం మాత్రం ఎందుకూ?

ధర్మమే మరి

అంధకారంలోంచి వెలుగులోకి రావడానికే కాని వెలుగు లోంచి అంధకారంలో కూలిపోవడానికి ఎవరూ ఇష్టపడరుగా?

మన కళ్ళ యెదుట, భాష విషయమై యింతటి మార్పు రావడానికి కారణం వ్యవహారిక భాష విశిష్టత వొక్కటి మాత్రమే కాదు, అప్పారావు గారి రచనల ప్రభావమున్నూ.

రామమూర్తి పంతులు గారి వాదం జాతికి ధైర్య సాహసాలు కలిగించగా, అప్పారావు గారి రచనలు దారి చూపించాయి.

అంచేతనే అప్పారావు గారు 'మార్గదర్శి' అనడం

అప్పారావు గారు చిన్న కథలు రాశారు. వాటిలో వొకటి 'దిద్దుబాటు' అనేది యిప్పటికీ అద్వితీయమే. అది మొట్టమొదట ముట్నూరు వారి ఆంధ్రభారతి మొదటి సంచికలో పడ్డప్పుడు రసికాంధ్ర లోకం వూగిపోయింది.

వారు ముత్యాల సరాలు నిర్మించారు. వాటినెందరో ఉదాహరిస్తుంటారు. కాని, ఆ భాష, ఆ నుడికారం, ఆ రచనా పద్ధతి, ఆ భావ సౌందర్యం— యిప్పటికీ యెవరూ అలవరచుకోలేకపోయారు.

వారు 'మాటా-మంతీ' అన్న శీర్షికలో చాలామంచి వ్యాసాలు రాశారు. ఒక్క 'చాలా' అంటే చాలదు. చాలాచాలా మంచి వ్యాసాలవి. వాటిలో కొన్ని బొంబాయి ఆంధ్రపత్రిక లోనూ, కొన్ని రాజమండ్రి ఆంధ్ర కేసరి లోనూ ప్రకటన అయినాయి వాటిలో 'ఇద్దరు రాజులు' అనేది యిప్పటికీ నా కళ్ళ యెదట కనబడుతోంది. రెండోది ఆకాశరామన్న ఉత్తరానికి ప్రత్యుత్తరం కూడా నా దృష్టిలో గొప్పదే ఆ వుత్తరం పెద్దాపురం నుంచి వచ్చినట్లు తమ ప్రత్యుత్తరంలో అప్పారావు గారే ఉటంకించారు. రాసిన వారెవరో చెప్పలేదు; గాని గుర్తించినట్లే కనబడుతుంది. నాకు మాత్రం ఆ రాసిన వారెవరో బాగా తెలుసు. రాసిన వారే నాకు చెప్పారు. అయితే, ఆది రాయడాని క్కారణం వారికి గ్రాంధిక భాష మీది అభిమానమే గాని పాపం అప్పారావు గారిమీది ద్వేషం కాదు.

అప్పారావు గారి రచనల్లో మిక్కిలి చెప్పుకో తగ్గవి నాటకాలు. వాటిలో కన్యాశుల్కం జాతిరత్నం. బిల్హణీయం పూర్తి అయి వుంటే అది అంతకంటే పెద్ద జాతిరత్నం అయివుండేది; కానీ ఆంధ్ర జాతికి ఆనాటి నాటకం చూసుకునే అదృష్టం పట్టలేదు. కన్యాశుల్కంలో ప్రతీ వాక్యానికి కొన్నేసి పేజీల వ్యాఖ్యానం చెయ్యగల మనీషిని నేనెరుగుదును. వారుశ్రీభమిడి పాటి కామేశ్వరరావు గారు. కన్యాశుల్కం తలంపుకి వస్తే -అథవా- ఆ పేరు చెవిని పడితే వారి శరీరం ఆపాద మస్తకంగా పులకరిస్తుంది. అస్మదాదులం 'కన్యాశుల్కం బాగా తెలుసు'. అనుకుంటాం గాని కామేశ్వర రావు గారు దాని మీద ప్రసంగం ఎత్తుకుంటే, 'తెలియని వాడనై మెలగితిన్' అనుకోవలసిందే నేనువరుసగా రెండేళ్ళు ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికల్లో బిల్హణీయం రెండంకాలు చదివిన తరువాత కన్యాశుల్కం చదివినప్పుడల్లా ఎంతఆనందం కలుగుతుందో ఆ అసంపూర్ణ బిల్హణీయం జ్ఞాపకం వచ్చిన వెంటనే నాకంత దుఃఖం కలుగుతూ వుంటుంది. ఒక్క బిల్హణీయం చాలు, అప్పారావు గారెంతటి మహాకవో తెలుసుకోవాలంటే. అయితే, వారెంతటి మహాకవి అంటే ఆ బిల్హణీయం మరెవరూ పూర్తి చేయలేనంతటి- దాని కథాక్రమమే యెవరూ గుర్తించలేనంతటి- మహాకవి.

ఏతావాతా: అప్పారావు గారు మహాకవి మాత్రమే కాదు, తరవాత రచయితలందరికీ మార్గదర్శిన్నీ !

అయితే ఒక్క సత్యం చెప్పక తప్పదు. అదేమిటంటే వచన రచయితలు మాత్రమే అప్పారావు గారి మార్గదర్శకత్వం స్వీకరించారు. పద్యరచయితలు ఆ దారి పట్టుకోలేకపోయారు.

# ఫస్ట్ ప్రైజ్

మరాఠీ మూలం : **లక్ష్మణరావు సర్దేశాయి**

హిందీ అనువాదం : **వ్రజలాల్ శాహ్**

తెలుగు సేత : **కాలిపు వీరభద్రుడు**

హరబా చేతిని వదిలి దారిచూపిస్తున్న ఆ పిల్లాడు ఎటో మాయమైపోయాడు. హరబా కిప్పుడు మంచి చిక్కు వచ్చిపడింది. చీకట్లోని ఆకారాలు కళ్ళున్న వాళ్ళ కెలాగైతే అస్పష్టంగా కనిపిస్తాయో హరబాకి కూడా చుట్టుప్రక్కలవాళ్ళు కదిలే నీడల్లాగ కనిపిస్తున్నారు కళ్ళు వెడల్పు చేసి చూడాలన్న ప్రయత్నం వ్యర్థమయింది, చీకటి దారి! ఎంతో కష్టంతో చేతిలోని కర్రని టిక్‌టిక్ మనిపిస్తూ తొట్రుపడుతూ ఓ పదడుగులు ముందుకి వేసాడు. ఇంతలో ఎవరో అతన్ని ఢీకొన్నారు. మరో వ్యక్తి పడిపోబోతున్న అతన్ని పట్టుకొన్నాడు. మూడో వ్యక్తి తిట్టుతున్నాడు. నాల్గో వ్యక్తి సలహా యిస్తూ అన్నాడు- "ఏయ్, ఎవరూ దగ్గర లేకుండా యిలా తిరిగావంటే జనం నిన్ను తొక్కేస్తారు పడిపోతావు. కాళ్ళూ చేతులూ విరుగుతాయి.'

హరబాకి యీ సలహా నచ్చింది. అతనీ టౌనొచ్చి నాలుగయిదు రోజులే అయింది. అష్టకష్టాలూ పడి ఆ పిల్లాడ్ని పట్టుకుంటే వాడిప్పుడు అర్థాంతరంగా తనను వదిలేసేడు బొంబాయి రోడ్లు వాహనాలతోను, మనుషులతోను ఖాళీ ఉండవు. అక్కడ ఓ పల్లెటూరి గుడ్డివాడ్ని చూసే దెవరు? అతడున్న పల్లె సంగతి వేరు. అక్కడతను ముప్పయ్యేళ్ళు గడిపాడు. అక్కడయితే గొంతును బట్టే మనుషుల్ని పోల్చుకొనేవాడు. వాళ్ళ భావాలు కూడా అతనికి తెలిసినవే. తాకగానే చెప్పేసేవాడు అది ఏ యిల్లో, ఏ చోటో- ఆ వూరి మేప్ అతని గుడ్డి కళ్ళల్లో కట్టేసినట్టు. అక్కడి సంగతేవేరు. అదృష్టం అతన్ని అక్కడ ఉండనివ్వలేదు. మనోనేత్రాలు తెరుచుకోక ముందే తల్లి పోయింది. అక్క అతన్ని సాకింది, కలరా వచ్చి ఆమె కూడా ఒకానొక నాడు పోయింది. రెండుముద్దలు తినిపించడానికక్కూడా ఎవరూ లేరు. ఊరి దయతో బతకడంలో మజా లేదని గ్రహించి ఓ గ్రామస్తుని సహాయంతో బొంబాయి వచ్చాడు. బొంబాయిలో గుడ్డివాళ్ళకీ కుంటివాళ్ళకి ఆదరణ ఉందని మాత్రం అతనికి తెలుసు రైళ్ళలో తిరిగితే రోజుకి రెండూ, రెండున్నర అతిసులువుగా సంపాదించవచ్చు. ఈ ఆశతోనే అతను బొంబాయి వచ్చేడు. ఆ పిల్లాడి సాయంతో రమారమి పదిరూపాయలు సంపాదించాడు. కాని ఆ పిల్లాడు కృతఘ్నుడై ఓ గంటన్నర ముందు అతన్ని వదిలి పారిపోయాడు. ఇప్పు డతనికి దారి ఎవరు చూపిస్తారు? అనుకోకుండా అతని నోరు ఓ భజన కీర్తన చరణాన్ని పాడింది.

అంతలో ఓ కుంటివాడు దగ్గరికొచ్చి- "భాయీ, ఏడుస్తున్నావేం?" అని అడిగాడు.

"దారి సూపించే పిల్లోడు అయిపు లేకుండా పోయాడు."

"ఓస్, అంతేనా! బెంగపడకు. ఆ పిల్లోడికిబదులు నేను చూసుకుంటాన్నిన్ను."

అతను హరబా చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు హరబా రెప్పలు వికసించాయి- ఈ వ్యక్తి రూపాన్ని తన మనసులో నిలుపుకోడానికా అన్నట్టు. ఫుట్‌పాత్

మీద కూర్చోగానే హరబా అన్నాడు. "ఆ దేవుడే నిన్ను నా దగ్గరికి పంపాడు. నాదగ్గరుంటావు గదూ?

"ఎందుకుండనూ? నాకు మాత్రం ఎవరున్నారు?' అంటూ అతడు తనను కొంకి కర్రనిచేతిలోకి తీసికొని హరబాకి దగ్గరగా కూర్చున్నాడు.

హరబా అంచనాగా అతని భుజం మీద చెయ్యి వేసాడు అలా నెమ్మదిగా తడిమాడు. అతన్ని అర్థం చేసుకోవాలని ఈ కొత్తవాడు ఎలాంటివాడు, ఇతని భావా లెలాంటివి, మోసగాడు కాదు గదా? కాని గరుకుగా ఉన్న అతని నల్లని ముఖం నవ్వింది.

"నీ పేరు?" హరబా అడిగాడు.

"లకబా"

"ఏటి సేస్తావు?"

"నేను కుంటోడ్ని."

"ఏక్సిడెంటయి ఓ కాలు తీసేసినారు. ఆర్నెల్లు ఆసుపత్రిలో ఉన్నా. పచ్చం రోజులయింది, బయటి కొచ్చాను. నాకెవరూ బిచ్చమెట్టరు, దున్నలా గున్నా వంటారు. కాలు లేనిదే ఏ పని చెయ్యగలను. ఈ రకంగా నేవాలోసిత్తన్నాను. ఇంతలోకి నువ్వు కని పించావు నీ కష్టం సూసి నీతో తిరగాలనిపించింది, దొరికిన దానితో యిద్దరం బతుకుదాం, కలిసి ఉందాం కలిసి తిరుగుదాం.'

'ఓహ్ లకబా నువ్వెంత మంచోడివి. నామనసులో ఏటుందో సరిగ్గా అదే సెప్పినావు నువ్వు కూడా. దేవుడే నిన్ను పంపాడు. లేకపోతే నే నేమయిపోదునో కాని లకబా మనిద్దరం ఎక్కడుంటాం?'

అదో పెద్ద సంగతా. అక్కడే. ఎదురుగుండా వంతెనుందా, దాని కింద దేరా ఏసుకుందాం. మాంచి చోటు ఒకళ్ళ పూచీ పేచీ ఉండదు. వానొచ్చినా పరవాలేదు, పద, అక్కడికే పోయి అయిగా కూకుందాం.'

లకబా లేచి హరబా చేతిని పట్టుకొని బయలు దేరాడు. ఫుట్‌పాత్ మీద శనగ లమ్మేవాడున్నాడు. లకబా ఆకలి కళ్ళు అటు పరుగెత్తాయి "ఆకలి దంచే స్తుందన్నా, జేబులో డబ్బులున్నాయా?'

లకబా చేతిలో పావలా పెట్టి హరబా అన్నాడు. "తొరగా పోయి నాకు కూడా తే, ఆకలేస్తూంది.'

లకబా శనగలు తెచ్చాడు. అలా నడుస్తూనడుస్తూ ఒకరి విషయాలు యింకొకరు తెలుసుకున్నారు.

ఇద్దరూ వంతెన క్రింద చోటు చూసుకున్నారు. కొంత సేపు కూర్చుని తర్వాతి కార్యక్రమం గురించి ఆలోచించేరు. ఎక్కడెక్కడ తిరగాలి, భోజనమెక్కడ చెయ్యాలి మొదలైన విషయాలనిశ్చయించుకున్నారు. ఇద్దర్నీ కలిపి దేవుడు తమకు ఎంతో మేలు చేసాడని యిద్దరూమనసుల్లో అనుకున్నారు. ఇద్దరూ నిర్మలమైన మనసులతో కొత్తఆశతో, నూతన ఉత్సాహంతో ఒకరి కొకరు సహాయం చేసుకోడానికి ముందుకి అడుగు వేసారు. హరబా కళ్ళ ఎదుట తారట్లాడే నీడల్లో యిప్పుడు వెలుగు కిరణాలు కదులాడుతున్నాయి కొన్నాళ్ళు గడిచాయి, ఒకరి కష్టసుఖాల్లో యింకొకరు ఆదుకుంటున్నారు రైళ్ళలో రోజుకి రెండుసార్లు తిరగడంలో బాగా డబ్బు లొస్తున్నాయి. వంతెనక్రింద అంత మంచిది కాదని తెలిసిన వ్యక్తి దగ్గర హరబా డబ్బులు దాచుకుంటున్నాడు.

వంట బాధ పడలేక హోటల్లో భోజనం తెచ్చుకొని కాలక్షేపం చేస్తున్నారు అదీగాక వీధుల్లోతిరిగేటప్పుడు గృహిణులు ఏవో పదార్థాలు పెడుతూ ఉంటారు. అలాగే పొట్ట గడుపుకొంటూ వస్తున్నారు.

వాళ్ళ కోరిక తీరింది. డబ్బులు దొరుకుతున్నాయి, కాలమూ గడచిపోతూంది. డబ్బులు దాచుకుంటున్నారు కూడా, ఇంకేం కావాలి? ఒకరి నొకరు సేవ చేసుకుం

టున్నారు. వాళ్ళిద్దరిదీ ఓ చిన్న కుటుంబం. ఆ కుటుంబంలో ఆడది లేదు. అయినా ఆడవాళ్ళలాగే అనురాగం చూపించే మనసులున్నాయి. వాళ్ళ మనసులు కలిశాయి కూడా. ఒకరి కోసం ఒకరు ఎంతో బాధ పడతారు. రెండు త్రాళ్ళు ఒక త్రాడుగా కలిసిపోయాయి వేరు వేరు వ్యక్తులే అయినా యిద్దరూ ఒక్కటే ఒకడు లేనిదే రెండోవాడు బతకలేడు. ఒకడికి జబ్బు చేస్తే రెండోవాడు విలవిల్లాడిపోతాడు.

నెలాఖరున యిద్దరి రాబడి కలిపి లెక్క వేసుకున్నారు. ఇరవై రెండున్నర రూపాయిలయింది. ఆనందంతో యిద్దరూ ఉప్పొంగిపోయారు. వాళ్ళ జీవితాలు హాయిగా గడపడానికి ఆ రాబడి చాలు. తేలికగా గడపవచ్చు.

'మనం లాటరీ టికట్టు కొంటేనో' లకబా అన్నాడు

హరబాకి యీ సూచన నచ్చింది. పాతిక రూపాయల రాబడిలో అయిదు రూపాయిలు లాటరీకి ఖర్చు పెడితే నష్టమేమిటి?

'కాని జనాలు మనని మోసం చేస్తారేమో?'

'నేను చూడగలను గదా!'

"అయితే మటుకు నీకేం యింగిలీసొచ్చా" హరబా తన సంశయాన్ని వ్యక్తం చేసేడు.

'మరొకరి దగ్గరికి సదివిస్తాం.'

"ఆళ్ళే మనల్ని మోసం సేస్తారేమోనని."

'అంతా సెడ్డోళ్లే ఉంటారా! మనకి తెలిసిన హోటల్ కెళ్ళి సూపిద్దాం'

అలాగ ఓ అభిప్రాయానికొచ్చి వాళ్ళు అవాళే అయిదు రూపాయిల లాటరీ టికెటు కొన్నారు. హరబా దాన్ని రుమాల్లో చుట్టి మొలలో దోపుకున్నాడు. గాలిలో ఎగిరే ఓ కొత్త సుఖాన్ని పొందుదామని వాళ్ళిద్దరూ తలపడ్డారు.

కొన్నాళ్ళ తర్వాత ఫలితాలు తెలిసాయి. హరబా లకబాలు లాటరీవాడి దగ్గరి కొచ్చేరు. టికెట్ చూపించేరు. ఆ రంగు కాగితం వైపు కొంచెం దూరంలోంచి ఓ నల్లటి వ్యక్తి గుడ్లురిమి చూస్తున్నాడు— లాక్కుందామా అన్నట్టు. లకబా దృష్టి వాడిమీద పడ్డంతో అతడు మెల్లగా జారుకున్నాడు.

ఆ దుకాణదారుడు లాటరీ టికెట్ నంబరు చూసాడు. ఫలితాల పట్టిక చూసాడు; "పదిహేను రూపాయి లొచ్చింది."

'మీరు యిస్తారా?' హరబా అడిగేడు. ఇద్దరికోరికలు వికసించాయి. ఐదు పదిహేనయ్యింది. ఈ సారి ఐదు, ఐదు వేలు కావడంలో సందేహం లేదు.'

'పదిస్తాను, అయిదు కమీషను,'

ఇద్దరూ ఆశ్చర్యపోయారు. వాళ్ళని చూసి అతనన్నాడు— 'పదిహేనూ కావాలంటే గోవా వెళ్ళండి. హాస్యమాడేడు.

ఇద్దరి ముఖాల్లోంచి వేడిగాడ్పులు లేచాయి. పది నోటు వీళ్ళముందు ఉంచి అతనన్నాడు— "ఏదో ఒకటి చెప్పండి. అక్కర్లేకపోతే మీ లాటరీ టికెట్టు తీసుకోండి.'

హరబా చెయ్యి చాచి పది తీసుకున్నాడు. కాని లకబా మనస్సులోకి సందేహం వచ్చింది. దుకాణం వాడు లాటరీ టికెట్‌ని పెట్టెలో పెట్టి తన బేరంలో మునిగిపోయాడు.

ఇద్దరూ బరువుగా ముందుకి నడిచేరు. ఆ పిచ్చివాడు యిటూ అటూ చూస్తూ వీళ్ళని చూస్తున్నాడు. లకబా అటు తిరిగి ఆ పిచ్చివాడ్ని చూసాడు. సరిగ్గా అప్పుడే ఆ పిచ్చివాడు ఒక పాప చేతిలోని తినుబండారాన్ని లాక్కుని పారిపోతున్నాడు ఇద్దరు వ్యక్తులు వాడ్ని వెంట తరుముతున్నారు.

వాళ్ళిద్దరూ తమ పాతచోటుకి వచ్చి గోనెపంచీ వేసుకొని దానిమీద నడుం వాల్చేరు. రోజు వలె మనసు విప్పి మాట్లాడలేకపోయారు. తెలియకుండానే వారిరువురి మధ్యా ఓ గోడ లాంటిది లేచింది. ఇద్దరూ లాటరీ గురించ ఆలోచిస్తూ నిద్రపోయారు.

మర్నాడు బిచ్చమెత్తుకొని తిరిగి వచ్చేస్తూ లాటరీ టిక్కెటు కొన్నారు. మళ్ళీ ఆ పిచ్చివాడు ఆ రంగు కాగితాన్ని తినేసినట్టు చూసాడు.

పక్షం రోజులు గడచాయి ఈ రోజుల్లో వాళ్ళ వ్యాపారం బాగా సాగుతూంది. హరబా స్వరంలోంచి ఎలాంటి భావాలు వస్తున్నాయో గాని త్రోవ పోయే వారు ఏమీ యివ్వకుండా వెళ్ళలేదు.

తెల్లవారితే లాటరీయే గుర్తు వస్తూంది. సాయం కాలం కాగానే ఆ దుకాణదారుడ్ని లాటరీ గురించి అడిగేవారు. వాళ్ళ జీవితంలో లాటరీ ఓ విచిత్రమైన అంజడి లేవదీసింది,

ఈసారి వాళ్ళు చాలా జాగ్రత్తగా లాటరీ ఫలితాల కోసం ఎదురు చూస్తున్నారు. ఫలితాలు రాగానే యిద్దరూ గంపెడాశ పెట్టుకొని దుకాణం దగ్గరి కొచ్చారు. హరబా రుమాల్లోంచి టికెట్ తీసి లకబా కిచ్చాడు. అతడు దాన్నివిప్పి దుకాణదారుడికి చూపించేడు. దుకాణదారుడు లిస్టులో నెంబరు చూసాడు, 'మీ నెంబరుకి ఏమీ రాలేదయ్యా' అని అన్నాడు.

లకబా టికెట్టందుకొని ఉడుకు మోత్తనంతో దాన్ని చించి గాలిలోకి విసిరేసేడు.

పిచ్చివాడు యిదంతా చూసాడు. గాలిలో ఎగిరే టికెట్ ముక్కలు చూసి నవ్వసాగేడు. లకబా ముఖం వాడిపోయింది. అతని బాహువులు డీలా పడి పోయాయి. హరబాలో కూడా ఉత్సాహం చచ్చి పోయింది! ఆ గుడ్డి కళ్ళముందు మరింత చీకటి క్రమ్మింది,

మళ్ళీ లాటరీ టికెట్ కొన్నారు. ఈ బిచ్చగాళ్ళ అలవాటు చాలామంది దృష్టిలోకి వచ్చింది. ఏవో మాటలంటూ వినోదిస్తున్నారు, వాళ్ళిద్దరూ తమకు నచ్చిన రీతిలో లాటరీ గురించి రాత్రింబవళ్ళు ఆలోచించసాగేరు. హరబా కయితే కళ్ళు లేవు. అయినా అతనికి డోలాయమానంగా ఉన్న లకబా మనస్సు తెలిసిపోయింది. లకబా లక్ష్యమిప్పుడు బిచ్చమెత్తుకోవడం కాదు. మునుపటిలా మనస్సువిప్పి మాట్లాడలేదు రెండునెలల క్రిందటి వరకూహరబాని సోదరుని లాగ భావించేడు. సాకేడు. కాని యిప్పుడు యిరువురి మధ్య వైమనస్యం ఏర్పడి ది.

రాత్రికి వాళ్ళిద్దరూ పక్కల మీదికి చేరేరు. హరబా అన్నాడు. "లకూ, యివాళ టిక్కెటు కొన్నావు. అదే మన్నా బావుందా. ఆ పిచ్చిని యింతటిలో ఆపేయ్" హరబా స్వరంలో కరుణరసం పెల్లుబికింది.

లకబా త్రుళ్ళిపడ్డాడు. అతని మనసులోని అనుమానాలు మేల్కొన్నాయి. 'పాతిక వేల బహుమతే వస్తే యిన్నాళ్ళూ గూడు కట్టుకొన్న ఆ ఆకలి పోతూంది," లకబా అన్నాడు. అలాంటివే ఎన్నో ఉదాహరణలు చెప్పేడు. ఎంతోమంది బిచ్చగాళ్ళు పెద్ద పెద్ద బహుమతులు గెల్చుకొని చూస్తూండగానే ఆ స్తిపరులైపోయారో వాళ్ళందరి పేర్లూ చెప్పేడు ఇప్పుడు వాళ్ళు ఏం చేస్తున్నదీ చెప్పాడు.

'నిజమే, మనకి పాతికవేలు బహుమతొస్తాది. అయితే మనమేం చేసుకుందాం?"

ఈ ప్రశ్నతో లకబా త్రుళ్ళిపడ్డాడు. ఆశ్చర్య పోయాడు. అతని మనస్సులో మంచీ చెడూ అనేక సంగతులు మెదులుతున్నాయి. కొంచెం సేపయాక అన్నాడు — "అదేం మాటన్నా? బహుమతి చేతికొస్తే మనం సుకపడతాం!"

హరబా నవ్వుతూ శాంతంగా అన్నాడు — "పాతిక సంపాదించి దాన్ని జీర్ణం చేసుకొనే యోగం మనకి లేదు గదా, పాతిక వేలు వస్తే మనమెలా ఉంచగలం? ఆ డబ్బు కింద మనం అణిగిపోతాం,"

"లోకమంతా డబ్బు కోసం తహతహ లాడుతున్నాడు."

"కాని నేను గుడ్డోడినని నువ్వు కుంటోడివని మరచిపోకు."

"అందుకే డబ్బు మనకి మరింత అవసరం"

"ఎంత డబ్బు వచ్చినా నాకు కళ్ళు కనిపిస్తాయా? నీకు కాలొస్తాదా?"

లకబా మౌనం వహించేడు. హరబా ఆలోచనలు అతనికి నచ్చలేదు. అతనికి డబ్బు కావాలి.

'లకూ, మన కిప్పుడొచ్చిన లోటేమిటి సెప్పు. దేవుడి దయ వల్ల ఆదరంతో సూసుకొనే తమ్ముడివి నువ్వు దొరికావు నేను గుడ్డోడ్నే అయినా నీ ప్రేమ తెలుసుకోగలను. బండిలో ప్రయాణీకుల ముందు నేను చెయ్యి దాసేటప్పుడు వాళ్ళలో ప్రవహించే మానవత్వం నేను చూడగలను. దయగల ఆ చేతులిచ్చే డబ్బుల్తో మన జీవితాలు హాయిగా గడచిపోతాయి. మనకి అంత కంటె గొప్పతనం నాకింకేమీ కనిపించలేదు."

లకబా చెవిటివాడి లాగ అన్నీ వింటున్నాడు. హరబా మూసి ఉన్న తన కళ్ళముందు, మనస్సు ముందు ప్రకాశపు పట్టాల మీద కదలాడుతున్న తన భాగ్యంయొక్క రూపాన్ని చూస్తున్నాడు. చీకట్లో, రైలు పట్టాల మీద మెరుస్తూన్న ఎరుపు, పచ్చని దీపాలవైపు చూస్తున్నాడు లకబా. పదిహేనవ తేదీన లాటరీ ఫలితాలు వచ్చాయి. ఇద్దరూ చర్చిరోడ్డు మీదున్న దుకాణదారుడి దగ్గరికి వెళ్ళేరు. ఇవాళ దుకాణదారుడే వాళ్ళ టికెట్ నంబరు అడిగాడు. హరబా లాటరీ టిక్కెట్ తీసి లకబా కిచ్చేడు. లకబా ఆ టిక్కెట్‌ని అతని చేతికివ్వకుండానే నెంబరు చూపించేడు ఆ నెంబరు చూడగానే దుకాణదారుడి ముఖం వికసించింది తనచోటు నుంచి అతను కిందికి గెంతి అన్నాడు—"రెండొందల యాభై యిస్తాను. ఇష్టమేనా ?"

గ్రుడ్డివాడు కుంటివాడు మాట్లాడుకున్నారు. హరబా అన్నాడు—"ఇచ్చేయ్."

లకబా ఉజ్జాయింపుగా అన్నాడు — "పెద్దబహుమతే వచ్చుండాలి. మరో దుకాణం దగ్గర అడగాలి" వెంటనే టిక్కెట్‌ని తన పిడికిలితో బిగించేసేడు. అతని మనసులో అనుమానం వచ్చింది. అదిముఖంలో కనిపించింది.

* * *

శనివారం, తెల్లవారింది లగాయతూ వాహనాలు బారులు బారులుగా ప్రవహిస్తున్నాయి. ట్రాఫిక్ పెరగ సాగింది. చుట్టుపక్కల చెట్లమీంచి కాకులు అరుస్తున్నాయి. చౌరాస్తా నుంచి బయలు దేరన గాలితీవ్రత హెచ్చింది ఆ రాకపోకలు ఆ కలకలం అక్కడి జీవితానికి రంగులు దిద్దుతాయి.

దుకాణానికి దగ్గర్లో నిలబడ్డ ఓ వ్యక్తి గట్టిగా కేక పెడుతున్నాడు—"నెంబర్ ఏడువందల యాభై—ఫస్ట్ ప్రైజ్, పాతిక వేలు" అని.

వెంటనే లకబా మూసిన తన పిడికిలిని విప్పి అక్కడున్న వాళ్ళకి టికెట్ చూపించేడు మళ్ళీ కేక వినిపించింది—"నెంబర్ ఏడువందల యాభై—ఫస్ట్ ప్రైజ్, పాతిక వేలు."

హరబాని పక్కకు నెట్టి లకబా ముందుకి ఉరికేడు. తొట్రుకుంటూ రెండో దుకాణంవైపు వెళ్తున్నాడు. పరుగెత్తుతున్నాడు. డబ్బుపిచ్చి అతన్ని ఉక్కిరి చేసేస్తూంది. ఇన్నాళ్ళూ దాగివున్న భావాల నాగులు బయటికొచ్చాయి అవి తమ కోరల్లోంచి విషం గ్రక్కుతున్నాయి.

లాటరీ డబ్బు పట్టుకొని లకబా పారిపోతున్నాడనే సంగతి హరబాకి అర్థమైపోయింది. విచిత్రమైన ఓ అనుభూతితో అతను చలించి పోయాడు.

"లకూ ! లకూ !" అతను పిలిచాడు. ప్రజలకు యిదో వినోదంలా ఉంది. లకబా పరుగెత్తుతున్నాడు.

పాతికవేలు తప్ప అతనికింకేమీ కనిపించలేదు. అతడు వివేకం కోల్పోయాడు. ఆ ఒక్క క్షణం లోనే అతడు హరబాని పూర్తిగా మరచిపోయాడు. బహుమతిలో అతనికి మొదటే తన అదృష్టం మెరుస్తూ కనిపించింది.

"లకూ ! లకూ ! " మళ్ళీ హరబా కేక వినిపించింది.

హరబా వణికిపోతూ, తడుముకుంటూ, తొట్రుకుంటూ ముందుకి వెళ్తున్నాడు, 'నువ్వు పారిపోవద్దు, పాతికవేలూ నీకే యిచ్చేస్తాను' అని లకబాతో చెప్పాలని అతని అభిప్రాయం. గడచిన మూడుమాసాల్లో లకబా సావాసంలో లభించిన సుఖం యిప్పుడు చేతుల్లోంచి జారిపోయినట్టుగా ఉందతనికి. అతడాసుఖాన్ని వెంబడించి పరుగెత్తుతున్నాడు.

లకబా రోడ్డు దాటేసి స్టేషన్‌కి చేరుకున్నాడు, టికెట్ తీసుకొని ఎక్కడికో దూరంగా వెళ్ళిపోతాడు- అనిపించింది హరబాకి.

లకబా డబ్బు తీసుకోడానికి విలవిల్లాడిపోతున్నాడు. చుట్టుప్రక్కల ఉన్నవాళ్ళు తన ప్రైజు టిక్కెట్టు లాక్కొంటారేమో అనిపిస్తూందతనికి. అంచేత వీలైనంత వేగంగా లాటరీ ఏజెంటు దగ్గర డబ్బు తీసుకొని పారిపోవాలనుకుంటున్నాడు—ఎక్కడికో దూరంగా శాంతిగా సుఖంగా బ్రతకడానికి...!

లకబా ఏజెంటుకి టికెట్ చూపించేడు. అటిక్కెట్టే ఫస్ట్ ప్రైజ్ దని ప్రకటించారు. ఇంతలో వెనకనుంచి ఎవడో లకబా చేతిలోని ఆ టికెట్‌ని లాక్కొని పారిపోతున్నాడు.

"పిచ్చోడు ! పిచ్చోడు !" అక్కడున్న వాళ్ళు కేకలు వేసేరు. జనసమూహం లోంచి పారిపోతూ ఆ పిచ్చివాడు లకబాకి కనిపించేడు.

తనశక్తినంతటినీ కూడదీసుకొని లకబా వాడి వెంటపడ్డాడు.

ఇంతలో ఎవరో ఆ పిచ్చివాడ్ని పట్టుకొన్నారు. పిచ్చివాడు తప్పించుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఆ దృశ్యాన్ని చూస్తూ లకబా ముందుకి పోతున్నాడు. అతని ముఖం భయంకరంగా కనిపిస్తూంది.

సరిగ్గా అప్పుడే హరబా తడుముకొంటూ రోడ్డు మీద పడిపోయాడు. మంచి వేగంతో పారిపోతూన్న మోటారు చక్రం క్రిందికి వచ్చేసాడు. గట్టిగా ఓ ఆర్తనాదం వినిపించింది ! గందరగోళం లేచింది. ఇద్దరు వ్యక్తుల చేతుల్లో పెనగులాడుతున్న పిచ్చివాడు మొదటి బహుమతి లాటరీ టిక్కెట్టుని ముక్కలు ముక్కలుగా చించి గాలిలోకి ఎగురవేస్తూ గట్టిగానవ్వసాగాడు. అంతా ఆశ్చర్యంగా చూడసాగారు.

లకబా గాలిలో ఎగిరే లాటరీ టికెట్ ముక్కలు చూసేడు. రక్తపు మడుగులో విలవిల్లాడుతూ గాయపడిన హరబాశరీరాన్ని చూసాడు. మళ్ళీ ఆముక్కల్ని చూస్తూ శక్తినంతటినీ కూడదీసుకొని గట్టిగా అరిచేడు—"ఫస్ట్ ప్రయిజు !"

ఈ మాటలూ, ఆ ముక్కలు ఒకదానితోబాటు ఒకటి గాలిలో వ్యాపిస్తున్నాయి.

హిందీ లెక్చరర్,
ప్రభుత్వ జూనియర్ కళాశాల,
నర్సీపట్నం,
విశాఖ జిల్లా-531 116.

# కుమార సంభవం ప్రాచీన గ్రంథం కాదు

— డా॥ గోపాలకృష్ణ అబ్బూరి

నవంబరు నెల (1988) 'స్రవంతి'లో శ్రీ సూర్య దేవర రవికుమార్ గారు "నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీన గ్రంథమే" అన్న శీర్షికతో రాసిన వ్యాసంలో ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారు తమ గ్రంథం ('నన్నెచోడుని కుమార సంభవము ప్రాచీన గ్రంథమా?!")లో ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని ఖండించడానికి ప్రయత్నం చేశారు. 1988లో ప్రకటితమైన కొర్లపాటి వారి రచనను ఖండించడానికి ఆలస్యంగానైనా జరిగిన ఈ ప్రయత్నాన్ని చూసిన తర్వాత ఆనంద విచారాలు వొక్కసారే కలిగాయి. తెలుగు సాహిత్య చరిత్రలో బలవంతాన దూరి కూర్చున్న వొక కావ్యం గురించి వెలువడిన కఠోర సత్యాన్ని ఖండించడానికి సాహసోపేతమయిన ప్రయత్నం జరిగినందుకు సంతోషమూ, ఆ ప్రయత్నాలు విఫలం కావడం వల్ల విచారమూ సదసద్వివేక చతుర మతులకు కలగడం సహజం.

సాధారణంగా యే సిద్ధాంతాన్నయినా స్థాపించేటప్పుడు ప్రధాన సాక్ష్యాధారాలతో పాటు మరికొన్ని చిన్న చిన్న ఆధారాలను కూడా సిద్ధాంతకర్త తన వాదానికి బలంగా చూపడం జరుగుతుంది. అసలు సాక్ష్యాలను వదలి చిన్నచిన్న ఆధారాలను కేవలం ఊహాబలంతో కొట్టివేసినంత మాత్రాన అసలు సిద్ధాంతానికి యేర్పడే ప్రమాదమేదీ వుండదు. శ్రీరవికుమార్ గారు ఈ విషయాన్ని విస్మరించడం విచారకరం,

అసలు 'కుమార సంభవం' ప్రథమ ముద్రణతోటే వివాదాలు ప్రారంభమయ్యాయని అందరికీ తెలిసిన విషయమే. ఈ వివాదాలకు మూలాధారం తంజావూరి ప్రతి. ఈ తంజావూరి ప్రతి గురించి శ్రీ రవికుమార్ తమ వ్యాసంలో—

1. "ఆనాడు కవిగారి వద్ద మూడు ప్రతులు కలవని, అందు నైజాము రాష్ట్రమున లభించినదను ప్రతియే ఈనాటి తంజావూరు సరస్వతీ మహలులో గల ప్రతియని నా నమ్మకము."
(స్రవంతి- నవంబరు పుట 21)
2. "రెండవ భాగమును ప్రకటించుటకు ముందు బహుశ 1911-12 సంవత్సరములలో కవిగారికి మరియొక ప్రతి లభించినట్లు వారే తెల్పిరి. అప్పుడు కవిగారు బహుశ ఆ ప్రతిని తంజావూరు గ్రంథాలయమునకు చేర్పించియుందురు," (పుట 31)
3. "ద్వితీయ భాగమును ప్రకటించుటకు ముందు మూడవ ప్రతి లభించినదని అదే యీనాటి సరస్వతీ మహలులో గల ప్రతి అని భావింపవచ్చును. (పుట 32)

అని ముమ్మారు నొక్కి వక్కాణించారు. మరి—

"...ఇది యెల్ల 1912 సంవత్సరము కంటె పూర్వము తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయము నందు కుమార సంభవము తాళపత్ర గ్రంథము లేదనుటకు నిర్ధారక సాధనము." (కొర్లపాటి పుట 190)

అన్న కొర్లపాటి వారి అభిప్రాయాన్ని రవికుమార్ గారు ఆమోదించినట్లే గదా! "మహాగజాః పలాయంతే మశకానాం తు కాకథా?"

అయితే గమనించవలసిన విశేషం మరొకటున్నది. తంజావూరి ప్రతిలో ఆశ్వాసాంతాల చివర ప్రతి విలేఖకుడు రాసిన వాక్యాలు ఆ ప్రతి శాహజీ మహారాజు కోసం తయారైనట్లు సూచిస్తూండగా మానవల్లి వారికి లభించడం యెలా జరిగింది? దీనికి జవాబు చెప్పవలసిన బాధ్యత రవికుమార్ గారి మీద ఉన్నది.

> "శ్రీ తిరుపతి దేవస్థానము వారు, వారి వద్ద నున్న యమూల్య తాళపత్ర సంచయమును ఆయిదు వేల రూపాయలకు కొనిరి." (మానవల్లి కవి రచనలు. పుట 48)

అని కీ.శే. నిడుదవోలు వెంకటరావు గారిచ్చిన సమాచారం. మిగిలిన రెండు కుమార సంభవపు ప్రతులు అందులో చేరకపోవడం యెందువల్ల?

> "...1917 ప్రాంతములో మొట్టమొదట ఆ తాళపత్ర ప్రతికి కొత్తపల్లి సూర్యారావు గారి చేత పిఠాపురం రాజావారు వ్రాతప్రతిని వ్రాయించి తెప్పించికట్లు నిడుదవోలు వేంకటరావు గారు వ్రాసిరి. అప్పటికే ఆ ప్రతి కొన్ని చోట్ల శిథిలమైనది." (పుట 23)

అని రవికుమార్ గారి వివరణ. అప్పటికా ప్రతి కొన్ని చోట్ల శిథిలమైనది అని చెప్పడానికి ఆధారాలు నిడుదవోలు వారి మాటల్లో లేదు. ఆశ్చర్యం. ఇది రవికుమార్ గారి దివ్యదృష్టి!

> "నూట యిరువది యేడు తాటియాకులున్నవి. అక్కడక్కడ కొంచెము శిథిలమయియున్నను మొత్తము మీద మంచి స్థితిలోనే యున్నది." (కొర్లపాటి. పుట. 12)

అని శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు 1937 లో యిచ్చిన సమాచారం! తాత ప్రతిని సూక్ష్మంగా పరిశీలించిన ఇటీవలి యేకైక పరిశోధకులు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారి మాటలివీ—

> "కుమారసంభవము తాళపత్రగ్రంథము అక్కడక్కడ శిథిలమైనను, క్రిమికీటక దష్టమైనను, పరిశీలక మృష్టమైనను ఇప్పటికిని అంత ప్రాచీనముగ లేదు. తాటాకు పెళుసెక్కలేదు. పట్టుకొన్న విరుగుటలేదు. ముట్టుకొన్న ముక్కలగుట లేదు, వల్లభామాత్యుని క్రీడాభిరామమువలె. పసుపురంగు కగ్గిపోలేదు" (కొర్లపాటి. పుట 18)

అదీగాక తాటాకు ప్రాచీనతను శైథిల్యాన్నిబట్టి నిర్ణయించడం పొరపాటు. వాతావరణ పరిస్థితులు తాటాకులమీద విపరీతమయిన ప్రభావాన్ని చూపుతాయి. అంతేకాదు కావాలనుకుంటే సరికొత్త తాటాకును పరమప్రాచీనంగా కనబడేటట్లు చెయ్యవచ్చు. ఇందుకు వొకనెలరోజుల వ్యవధిచాలు. ఆ వివరాలన్నీ ఇక్కడ వివరించడం మరింత ప్రమాదకరమని వదిలిపెడుతున్నాను. ఎవరైనా నాకు సరికొత్త తాటాకులను పంపితే వాటిని ప్రాచీనమైనవిగా మార్చి పంపగలనని మనవి.

ఇంక ప్రాచీన తాళపత్రగ్రంథాలతో పరిచయం వున్నవారికి లేఖనపద్ధతులూ, లేఖకదోషాలూ తెలిసేవుంటాయి. కొత్తగ్రంథాన్ని ప్రాచీన రచనగా మార్చడం పెద్దకష్టమేమీకాదు.

ఇంక కవిగారి కరకౌశలం గురించి కొర్లపాటివారు చేసినవ్యాఖ్యను కువ్యాఖ్యగా చిత్రించిన రవికుమార్ గారు—

> "కుమార సంభవముననేకాక కవిగారు ప్రకటించిన అన్యగ్రంథములలో కవిగారి కరకౌశలము కలదని శ్రీరామమూర్తిగారికి 'అవగాహన' అయిన, దానిని నిరూపించవలసినదిగా వారిని వేడుచున్నాను" (పుట 28)

అన్నారు. మరీ అంతగా వేడుకొని బాధపడిపోవలసిన అవసరం లేదనుకుంటాను. చూడండి—

"ఎఱ్ఱన నృసింహ పురాణములోని కవిగారి పద్య గద్యములు ఎఱ్ఱన పద్యగద్యములవలెనే కలవు. నారన సూరన ఉదయనోదయములోని కవిగారి పద్యగద్యములు నారనసూరన పద్యగద్యములవలెనే కలవు. ఇది మానవల్లి రామకృష్ణకవిగారి మహాప్రతిభకు మణిదర్పణము" అని డా. శ్రీరామమూర్తిగారి వ్రాత" (పుట. 34)

అంటూ రవికుమార్‌గారే గుర్తించారుగదా. ఇంకా వెదుకొనడం దేనికి? అదీగాక కొర్లపాటి వారు పై వాక్యాలకు బలంగా తమ గ్రంథంలో ఆయా పద్య గద్యాలను అనుబంధంగా ఇచ్చేవున్నారు. గమనించలేకపోవడం శ్రీసూర్యదేవర రవికుమార్‌గారి 'సమ్యక్పరిశీలనాదృష్టి'కి మణిదర్పణము! చంకను బిడ్డనెత్తుకుని వూరంతా వెదికిన చందం!

ఇంక కుమారసంభవంలోని బాకు, తరవారి, కైపు మొదలయిన అన్యదేశ్యాలను గురించి రాస్తూ—

"విమర్శకులలో ఏకాభిప్రాయములేని ఇటువంటి పదప్రయోగముల నాధారము చేసికొని కావ్యముల కాల నిర్ణయములు చేయుట ప్రామాదికము" (పుట 33)

అంటారు రవికుమార్ గారు. అంతేకాదు "కైపు' శబ్దము గూర్చి దొణప్పగారే "అతిప్రాచీనమని శుద్ధ దేశ్యమని" చెప్పిరని డా. శ్రీరామమూర్తిగారే వ్రాసియున్నారు" అనికూడా అనడం కేవలం పాఠకులను తప్పుదారి పట్టించడానికే. ఆచార్య దొణప్పగారి వాదాన్ని పదిహేను ఉదాహరణలతో విపులమైన చర్చతో పరాస్తంచేసి—

"ఇంత ఝటితిస్ఫూర్తిని కుమారసంభవములోని కైపుశబ్దమునకు మత్తు, మదము, అథవా, ఉద్రేకము అనుఅర్థములు భాసించుచున్నను, భాషాశాస్త్రజ్ఞులు ద్రావిడప్రాణాయామము చేయుటకు హేతువు, కుమార సంభవము పండ్రెండవ శతాబ్ది గ్రంథమను ప్రగాఢ విశ్వాసము కావచ్చును" (కొర్లపాటి. పుట 31.)

అంటూ ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు ఇచ్చిన తీర్పును పట్టించుకోకపోవడం వెనుకనున్న ఉద్దేశమేమిటో! తనవాదాన్ని నిలుపుకోవడానికి సూర్యదేవర రవికుమార్‌గారు లేవనెత్తిన ఇలాంటి దుర్బలమైన అంశాలు వ్యాసంనిండా విస్తరించుకొని వున్నాయి. సమలిన వాలుకాకణరజంబులనెన్నను.... విధాతృనకైనను నేరఁబోలునే?

సత్యశోధనకై సాగే చర్చలన్నిటిలో మన ఇష్టాయిష్టాలనూ, మమకారాలనూ వదిలిపెట్టవలసి వుంటుంది. లేకపోతే సాధించేదేమీ వుండదు. రవికుమార్‌గారు తమ వ్యాసంద్వారా వెలుగులోకి తెచ్చిన కొత్తవిశేషాలేం లేవు. పైగావారు లేవనెత్తిన అనేక విషయాలకు సమాధానాలు ఆచార్య కొర్లపాటి వారి గ్రంథంలోనే లభిస్తాయి. విమర్శించేముందు గ్రంథాన్ని సావకాశంగా అర్థం చేసుకుంటూ చదవడం ముఖ్యం. ఆమాత్రం శ్రమకి తట్టుకోలేకపోతే మౌనంమేలు. కుమారసంభవం మానవల్లివారి కూటసృష్టి అన్న విషయాన్ని ఆమోదించి తెలుగు సాహిత్య చరిత్రనుంచి ఆ గ్రంథాన్ని తొలగించడం అవశ్యకర్తవ్యం.

8/1 పిఠాపురం బీచ్ క్వార్టర్స్
ఆంధ్రాయూనివర్సిటీ కాంపస్
విశాఖపట్నం. 530003

# ఉద్భటారాధ్య చరిత్ర- కొన్ని ధర్మసందేహాలు

— సూర్యదేవర రవికుమార్

1987 జనవరి నెల 'స్రవంతి'లో ప్రచురించబడిన శ్రీ బేతవోలు రామబ్రహ్మం గారి "ఉద్భటారాధ్య చరిత్ర-కొన్ని ధర్మసందేహాలు' వ్యాసం చదివి యీ నాలుగు మాటలు వ్రాయనుత్సాహపడు చున్నాను.

ప్రాచీనాంధ్ర సాహిత్యములో ఉద్భటుని చరిత్రను వ్రాసిన కవులిద్దరు. పాల్కురికి సోమనాథుడు 88 ద్విపదలలో ఈ కథను క్లుప్తంగా చెప్పగా తెనాలి రామలింగకవి మూడాశ్వాసాల కావ్యంగా ఈ కథను పెంచి వ్రాశాడు. ఈ ఇద్దరి కథలకు గల భేదము లివి.

| బసవ పురాణము | ఉద్భటారాధ్య చరిత్ర |
|---|---|
| 1. పురము పేరు బల్లకి | వల్లకి నగరము |
| 2. పేరు- ఉదుభటుడు | ఉద్భటుడు |
| 3. ఉద్భటుని భార్యపేరు జొమ్మవ్వ. హీనకులజ | పేరు సౌభాగ్యసుందరి, ధరణి సురుని కుమార్తె. |
| 4. భూతములసంఖ్య ఏడువందలు | సంఖ్య చెప్పబడలేదు |
| 5. భూతముల పూర్వ కథలేదు | పూర్వకథ చెప్పబడినది |
| 6. భూతములు మఱ్ఱిమీద నివసించిన కాలము 12 వేల సం॥లు | నూరుదివ్యసమములు. 86,500 సం॥లు |
| 7. కైలాసమును చేరక మిగిలిన భూతము నకు పేరులేదు | పేరు చిత్రరథుడు. గంధర్వనాథుడు |
| 8. రాజు పేరు భోజుడు | ముంజభోజుడు |
| 9. భూతము ఏడ్చినపుడు పురజనులు, రాజు వచ్చిరి. | వచ్చినవాడు ముంజభోజుడొకడే. |
| 10. రాజు చితియందు అగ్నిని నెలకొల్పును. | భూతమును బ్రోవుమని రాజు తన ప్రాణత్యాగము చేయబోగా శివుడు ప్రత్యక్షమగును. |
| 11. భూతముతోపాటు మఱ్ఱిచెట్టు, భోజ రాజు, అతని బంధుమిత్రులు, పుర జనులు కైలాసమునకు వెళ్ళుదురు. | భూతమునకు మాత్రమే కైలాస ప్రాప్తి. |

సోమనాథ, రామలింగ కవులు ఉద్భటుడు మరణానంతరమే పరమ శివునితో ఐక్యము చెందినట్లు తెల్పగా, శివతత్త్వసారమున పండితారాధ్యులు ఉద్భటుడు బొందితో కైలాసము చేరినట్లు ఈ విధముగా వ్రాసినాడు.

హరలీలాస్తవ రచనా
స్థిరనిరుపమ భక్తిఁ దనదు దేహము తోడన్
సురుచిర విమానమున నీ
పురమున కుద్భటుడు ప్రీతి బోవడె రుద్రా.

410 ప.

పండితారాధ్యునితో పాటు కుమారసంభవ రచయితయగు నన్నెచోడుడు కూడ ఉద్భటుని హరలీలాస్తవ రచయితగా పేర్కొనినాడు.

క్రమమున నుద్భటుడు కపి
త్వము మెఱయఁ గుమార సంభవము సాలంకా
రము గూఢవస్తుమయ కా
వ్యముగా హరలీలఁ జెప్పి హరు మెప్పించెన్.

హరలీలను పండితారాధ్యులవారు చదివినట్లు పండితారాధ్య చరిత్రలో వ్రాయబడి యున్నది కావ్యాలంకార సంగ్రహము అను ఒక అలంకార శాస్త్రమును బరోడాలోని ప్రాచ్య పరిశోధనాలయము వారు ఉద్భటుని కృతిగా ప్రచురించినట్లు తెలుస్తున్నది. నిడుదవోలు వేంకటరావుగారు హరలీలలో కుమారసంభవము అలంకారయుతముగా గూఢవస్తువుగా చెప్పబడినట్లు భావించారు. విచిత్రమేమిటంటే సోమనాథ, రామలింగ కవు లిద్దరు ఉద్భటుని చరిత్రలో హరలీలను గురించి కాని, ఉద్భటుని రచనలను గురించి కాని ప్రస్తావించలేదు. ఇక కర్ణాటక కవులు ఉద్భటుని చరిత్రను వేరొక విధంగా చెప్పినట్లు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాశారు. శివభక్తుడైన ఉద్భటుని చరిత్రను శివకవులే భిన్న రీతులలో ప్రచారము చేయుట వలన ఉద్భటనామధేయులు ఒకరా, పలువురా అను సందేహమున కవకాశము కలుగుచున్నది. 'ఆంధ్ర వీరశైవ వాఙ్మయ మందెచ్చటను వేఱొక యుద్భటుడు లేడు. బసవ పురాణ రచనా కాలము నాటికి సోమనాథున కాతని గూర్చి వివరములు తెలియలేదని యనుకొనుట సముచితము' అని నిడుదవోలు వేంకటరావు గారు శివతత్త్వసార పీఠికలో (పుట 58) వ్రాశారు. సోమనాథుడు భక్తుల మూలమున విన్న కథనే గ్రంథస్థము చేశాడని, రామలింగకవి దేచమంత్రి గురువగు చంద్రశేఖరుని వలన ఉద్భటునిచరిత్రను తెలుసుకొని వ్రాశాడని కనుక 'రామలింగ కవిదే ప్రామాణికమని చెప్పవచ్చును' అని వారే ఉద్భటారాధ్య చరిత్ర పీఠిక (పుట 45)లో వ్రాశారు. కాని యీ క్రింది విషయము లను పరిశీలించితే సోమనాథ రామలింగ కవుల కథలలో చారిత్రకాంశముల కన్న పుక్కిటి పురాణాలే ఎక్కువగా చోటు చేసికొన్నట్లు స్పష్టం కాగలదు.

ఉద్భటుడు క్రీ.శ. 779-818 మధ్యకాలమున కాశ్మీర దేశమును పరిపాలించిన జయాపీడుని ఆస్థానమున కలడని సాహిత్య చరిత్రకారులందరు వ్రాసిరి ఇతనికి దినమునకు లక్ష దీనారాల (ఇక్కడ దీనార మనగా రాగి నాణెము) వేతనమట. లభ్యమైన చారిత్రకాధారాలను బట్టి ఆ కాలమున భోజుడను రాజు లేడు. ఉద్భటుని తరువాత కొద్ది కాలముననే ఘూర్జర ప్రతీహార వంశీయుడైన భోజు డొకడున్నాడు. గుజరాత్‌ను పాలించిన చళుక్య వంశీయుడైన మూలరాజు (క్రీ.శ. 941-996) మామ కూడా భోజుడే. ఈ భోజుడు చాహమాన వంశీయుడు. ఇక ధారానగరాధిపతులై పరమార వంశీయులైన ముంజుడు- ఆతని సోదరుని కుమారుడైన (ముంజ) భోజుడు ఉద్భటునికి సుమారు రెండు వందల సంవత్సరముల తరువాతి వారు.

సోమనాథ, రామలింగ కవులు పేర్కొనిన వల్లకీపురము ఎక్కడిదో చరిత్రకారులుగుర్తించలేదు. ఉద్భటుడు తన అలంకార శాస్త్రములో వల్లకీపురమును గురించి తెలుపలేదని ఉద్భటుని కాలమునకు కొంచెము ముందుగానే 'వలభీ పురము' అను నగరము నాశనమై

పోయినదని గ్రామనామాల పరిశోధనలో నిష్ణాతులైన బరోడా విశ్వవిద్యాలయ చరిత్ర శాఖాచార్యులు డా॥ ఆర్.యస్. మెహతా గారు వ్యక్తిగత లేఖలో తెలియజేశారు.

పైన తెలిపిన దానిని బట్టి భోజ లేక ముంజ భోజ రాజునకు ఉద్భటుని వాస్తవ చరిత్రతో సంబంధము లేదని, వారి సంబంధము కవుల కల్పన అని, అలాగే వల్లకీపురము కూడ సోమనాథుడు కల్పించినదేనని సుస్పష్టము. కనుక చారిత్రక వ్యక్తియైన ఉద్భటుని వాస్తవ చరిత్రకు మతపరమైన అభిమానము రంగులు పులమగా జనశ్రుతిని ఆధారముగా చేసుకొని స్వీయ కల్పనలతో సోమనాథ, రామలింగ కవులు ఉద్భటుని 'చరిత్ర'ను మనకు అందించారు.

ఉద్భటుని 'చరిత్ర'తో పాటు రామలింగకవి రచించిన ఉద్భటారాధ్య చరిత్ర కావ్యము కూడ 'ధర్మ సందేహాల'కు ఆలవాలంగా ఉండటం విచారకరం. ఉద్భటారాధ్య చరిత్రను తొలుత ప్రచురించిన వేటూరి వారు తమ పీఠికలో ఉద్భటారాధ్య చరిత్రలో గల ముదిగొండ వారి వంశవర్ణనము బసవ పురాణమున కానరాదని' మాత్రము చెప్పి ఊరుకొన్నారు. బహుశ వీరికి కూడా అనాడే ఇటువంటి (ఉద్భటారాధ్య చరిత్ర లోని కొన్ని భాగాలు- ముఖ్యంగా వంశ వర్ణన-ప్రక్షిప్తాలేమో అనే) ధర్మసందేహాలు కలిగి ఉండాలి. లేక పోతే అంటీ ముట్టనట్లు ఇలా రెండు ముక్కలు రాసి ఊరుకొనే మనిషి కాదు గదా వీరు"అని రామబ్రహ్మం గారు వ్రాశారు. అయితే వేటూరి వారు ఆ మాటే చెప్పి ఊరుకోలేదు. అధోజ్ఞాపికలో ఇంకా ఇలా వ్రాశారు "చంద్రశేఖరగురుని వరకు నా వంశక్రమమున్నది. ఈ చంద్రశేఖరుడే దేచయమంత్రి గురుడగునని నేనను కొనుచున్నాను" అని నిడుదవోలు వేంకటరావు గారు అసలు దేచమంత్రి గురువు చంద్రశేఖరుని కీర్తించుటకే రామలింగకవి ఉద్భటారాధ్య చరిత్ర వ్రాశాడని 'శైవ సంప్రదాయమున హరునకు గురునకు అభేదము కాన" రామలింగ కవి చంద్రశేఖర శబ్దాన్ని కావ్యంలో ఎక్కువగా వాడాడని, కాశీక్షేత్ర వర్ణన, మదాలసుని కథ తనకూ కృతిభర్తకూ కూడా గోత్రకర్త అయిన కౌండిన్యుని ప్రమథేశ్వరుడు సందర్శించినట్లు వ్రాయుట మొదలైన విషయాలు రామలింగకవి కోరి కావ్యంలో చొప్పించాడని వ్రాశారు. ఇది వాస్తవమే. ముందే చెప్పినట్లు ఉద్భటుని 'వాస్తవ చరిత్ర' పైరామలింగాదులకు మక్కువలేదు. అది ఏనాడో మరుగున పడిపోయినది. పుక్కిటి పురాణాలకు, తమ అభిప్రాయాలకు అనుగుణంగా 'రఘువచోవిలాసా'లతో కావ్యము చెప్పటమే కావలసినది. కనుక ఉద్భటారాధ్యచరిత్రలో గల చంద్రశేఖరగురుని వంశానుకీర్తనం రామలింగ కవిదే అని దృఢముగ విశ్వసించవచ్చును. చంద్రశేఖరగురుని ఇద్దరు కుమారులను కూడ ఉద్భటారాధ్య చరిత్ర పేర్కొంటున్నది. అయితే, ఈ వంశానుకీర్తనకు ముందుగల పద్యములలో కొన్ని నీరసములుగా ఉన్నాయని అవి ప్రక్షిప్తములు కావచ్చునేమో అని రామబ్రహ్మంగారు ఊహించుటలో అర్థమున్నది. ఉద్భటారాధ్య చరిత్రమీద మక్కువ గలిగి శిథిల స్థితిలోగల దాని తాళపత్రగ్రంథాలను సంపాదించి ఎత్తివ్రాసిన ముదిగొండ బసవయ్యశాస్త్రిగారో, 'లేఖక ప్రమాదముల సవరించి లుప్తభాగములం గాలవరకుం బూరించి'న మల్లంపల్లి మల్లికార్జున శాస్త్రిగారో ఈ నీరస రచనకు కారకులు కావచ్చును.

ఉద్భటారాధ్య చరిత్రకర్త ప్రయోగించిన 'లాగించు' అన్న క్రియాపదాన్ని గురించి రామబ్రహ్మంగారు సందేహం వ్యక్తంచేశారు. 'తీసికొను'

అనే అర్థం దీనికి ఆధునికమైనదికాదు. ఈ అర్థంలో చేమకూర వేంకటకవి ప్రయోగాన్ని శబ్ద రత్నాకరం చూపిస్తున్నది. ప్రకరణోచితంగా ఉద్భటారాధ్య చరిత్రలో గల ప్రయోగానికి అపహరించు అని అర్థం చెప్పుకొనవచ్చు. కనుక ఈ విషయమై ధర్మ సందేహం అనవసరము:

ఉద్భటారాధ్య చరిత్ర ముద్రిత ప్రతికి మూలాధారాలైన తాళపత్రప్రతులు ఇప్పుడెవరిదగ్గర ఉన్నవో తెలియవు. 1920 నాటికే లభించిన రెండు తాళపత్రప్రతులు శిథిలావస్థలో ఉన్నట్లు సంపాదకులు తెలియజేశారు. కనుక ఈనాడవి లభ్యంకాగలవనే ఆశలేదు. క్రొత్తగా ఎక్కడైనా మరొక తాళపత్ర ప్రతి సంపాదింపబడితే తప్ప రామబ్రహ్మంగారు ప్రక్షిప్తము కావచ్చునని అనుమానించిన ప్రథమాశ్వాసాంతమునగల మూదిగొండ పట్టణప్రసక్తికి సంబంధించిన పద్యాలు, ఉద్భటుని భార్యాసుతుల విషయమై గల పద్యాలు, రామలింగకవివా కావా అన్న సందేహము తీరదు.

వెటిరినరి అసిస్టెంటు సర్జను
పశువైద్యశాల, భట్టిప్రోలు
522256.

దక్షిణ భారత హిందీ ప్రచార సభ- ఆంధ్ర, హైదరాబాదు

స్వర్ణోత్సవ హిందీ పరిచయ పరీక్షా కార్యక్రమం

ఏప్రిల్ 1987

పరీక్ష తేదీ : 19-4-1987

శుల్కముతో పాటు పరీక్షార్థుల వివరం
పంపవలసిన తేది : 6-4-1987

ప్రచారకులు అధిక సంఖ్యలో విద్యార్థులను తయారుచేసి సహకరించ ప్రార్థన.

రామస్వామి
కార్యదర్శి

# ప్రియదర్శన

## (శ్రీహర్ష రచితము)

అనువాదము : కాకరపర్తి ముఖలింగ శర్మ

-: చతుర్థాంకము :-

(అంతట మనోరమ ప్రవేశించును.)

మనో : అబ్బా! దేవి కెంత రోషము! ఇంత కాలము నిర్బంధించినను ప్రియసఖి ఆరణ్యకపై అనుగ్రహ మిసుమంతయు చూపలేదు. (కన్నీటితో) ఆ తపస్విని తన నిర్బంధము కంటె భర్తను చూడ లేదను నిరాశచే తపించిపోవుచున్నది. ఈ నిరాశచే ఆత్మహత్య చేసికొనఁ బోవుచుండ నెట్లో నివారించితిని. ఈ వృత్తాంతము ప్రభువున కెరింగింపుమని వసంతకునితో చెప్పి వచ్చుచున్నాను.

(పిమ్మట కాంచనమాల ప్రవేశించును!)

కాంచ॥ : ఎంత వెదకినను భగవతి సాంకృత్యాయని నాకు కన్పింపలేదు. కావున నీ మనోరమను కూడ అడిగెదను. (దగ్గరకు వచ్చి) మనోరమా! భగవతి సాంకృత్యాయని ఎచ్చట నున్నదో ఎరుంగుదువా?

మనో॥ : (చూచి) చెలీ! కాంచనమాలా! ఆమె కనిపించినందువలన నేమి ప్రయోజనము?

కాంచ॥ మనోరమా! ఇప్పుడు దేవికి అంగారవతి యొక్క లేఖ పంపెను. దానిని చదువుకొని దేవి కనుల నీరు నింపుచు మిక్కిలి దుఃఖించుచున్నది. కావున నామెను వినోదింపఁ జేయు నిమిత్తం భగవతిని వెదుకుచున్నాను.

మనో॥ చెలీ! ఇంతకూ— ఆ లేఖలో ఏమని వ్రాయబడి యుండెను?

కాంచ॥ "నా చెల్లెలే నీ తల్లి. కావున నా భర్తయగు దృఢవర్మ నీకు తండ్రి యగును. ఆ కళింగ హతకు డతనిని బంధించి సంవత్సరము దాటినది. కావున నీ వృత్తాన్తమును దగ్గరనే యున్న సమర్థుడగు భర్తకు చెప్పక ఉదాసీనతతో ఉండరాదని ప్రత్యేకించి నీకు చెప్పనక్కర లేదని" యా లేఖలో కలదు.

మనో॥ చెలీ! కాంచన మాలా! ఈ వృత్తాన్తము రాకుమారికి ఎవ్వరు నెరిగింపరాదని రాజుగా రాజ్ఞాపించిరి కదా! ఇప్పుడెవరా యుత్తరము నామెకు వినిపించిరి?

కాంచ॥ : చదివియూరకున్న నా చేతినుంచి యుత్తరము తీసికొని స్వయముగ దేవి చదువుకొన్నది.

మనో॥ : అయినచో నీవు వెళ్ళుము. ఇదిగో! దేవి ఆమెతోనే దంత వలభియందు కూర్చున్నది.

కాంచ॥ : అట్లయిన భట్టిని దగ్గరకే యేగుదము. (నిష్క్రమించును.)

(ప్రవేశకము)

(అంతట సోద్వేగముగ వాసవదత్తయు,సాంకృత్యా యనియు, విభవము ననుసరించి పరివారము ప్రవేశిం తురు)

సాంకృ॥ : రాజపుత్రి! చాలునుద్వేగము! నీ పిన తల్లి మగడిట్టి యవస్థ నందియుండగా తెలిసియు వత్సరాజు నిశ్చింతగ నుండువాడు కాదు.

వాస॥ : (కన్నీటిలో) భగవతి! నీవు ముక్కుకు సూటిగ మాటాడుదువు, నేను రాజు నకు చేయవలసిన పని చేయనప్పుడు అతనికి నా వాతితో పనియేమి? పిన తల్లి ఆ విధముగ వ్రాయుట యుక్తమే. ఆమె ఇప్పటికిని నన్ను మునుపటి వాసవదత్తయే యనుకొను చున్నది. నీకి ఆరణ్యికా వృత్తాన్తము ప్రత్యక్షమే కద! తెలిసియు, నీవేల ఇట్లు పలుకు చున్నావు.

సాంకృ॥ : కనులార చూచితిని. కనుకనే ఇట్లు చెప్పుచున్నాను. కౌముదీ మహోత్సవ ములో నిన్ను నవ్వించుటకే రాజు అట్టి యాట యాడెను.

వాస॥ : భగవతి! ఈ విషయములో సత్య ముగ హసింపఁబడితిని. భగవతి యగు నీ ముందు సిగ్గుచే నెట్లో నిలుచున్నాను. ఇంత ఆ కథతో నేమి ప్రయోజనము? ఈ పక్షపాతము చేతనే ఇట్టి యవస్థ పొందితిని. (ఏడ్చును)

సాంకృ॥ : రాజకుమారీ! దుఃఖింపకుము. వత్స రాజు ఇట్టి వాడు కాదు. (చూచి) ఇదుగో! వత్సరాజు నీ కోపమును తీర్చుటకే వచ్చుచున్నట్లున్నది.

వాస॥ . ఇవి పూజ్యురాలి మనోరథములు. (రాజును, విదూషకుడును ప్రవేశిం తురు-)

రాజు : ప్రియురాలిని విడిపించుట కుపాయ మేది?

విదూ॥ ఓ మిత్రమా! విషాదము విడువుము. ఇదిగో నీకుపాయము చెప్పుచున్నాను.

రాజు॥ (హర్షముతో) వయస్య! వేగముగఁ దెల్పుము.

విదూ॥ మిత్రమా! నీ వెన్నో యుద్ధములందు భుజబలము చూపితివి. గజతురగ పదాతి సేనలచే శత్రుబలమును చెదరఁ గొట్టితివి కనుక- ఆ సర్వ సేనా సందోహముతో అంతఃపురము ప్రవేశించి ఆరణ్యికను విడిపింపుము.

రాజు॥ : వయస్య! అశక్యమునుపదేశించితివి గదోయి!

విదూ॥ : ఇట అశక్యమేమున్నది? అచ్చట మరుగుజ్జులు, వామనులు, ముగ్ధులు, ముసలివారు, కంచుకులు తప్ప ఇతరు లెవ్వరు లేరు కద !

రాజు॥ : (అవజ్ఞతతో) మూర్ఖ! ఏమి అసంబద్ధము ప్రేలుచుంటివి? దేవి యను గ్రహము తప్ప వేరొక విధమున ఆమెను విడిపించు నుపాయములేదు. అందుచే దేవిని ప్రసన్నము చేసికొను విధము దెలుపుము.

విదూ॥ : ఓయీ మా సోపవాసము చేయుము. అప్పుడు చండిక ప్రసన్నురాలు కావచ్చును.

రాజు॥ : వేళాకోళము చాలించి దేవినెట్లు ప్రసన్నము చేసికొనవలెనో తెలుపుము.

ఉ॥ సుందరిఁ బోయి నవ్వుచును ముద్దియ ధృష్టత గౌగిలింతునో
సుందర చాటు వాక్యములఁ జొక్కగ జేయుదునో- విధేయతన్
వందన మను జేయుదునా? భామ పదంబుల మీద వ్రాలగా
నౌదునా కాంతి? దేవి యెటులూరడిలున్ దెలియంగ రాదుగా,

కావున రమ్ము! దేవి సమీపమున కేగెదము.

విదూ॥ : నీవుపొమ్ము. నేనెట్లో బంధనము నుండి తప్పించుకొని ఇప్పుడిట వచ్చితిని, కావున పోవుచున్నాను.

రాజు॥ : (నవ్వి) (అతని మెడ పట్టుకొని బలవంతముగ మరలించును.) మూర్ఖ! రమ్ము. (తిరిగి-చూచి) ఇదుగో దేవి దంత వలభియందు కూర్చున్నది. చేరెదను. (సిగ్గుతో చేరును)

(వాసవదత్త ఖేదముతో ఆసనము నుండి లేచును.)

రాజు॥ ఉ॥ ఆసనమేల వీడితివి? యంగన దాలును సంభ్రమంబు, నీ
కోసలి! నీవు లేచుటిది యుక్తము కాదు త్వదీయ దృష్టులన్
నే సుఖినై వశంబగుదు- నింతటి యాదర మిప్పుడేలనో
చేసెద వింతి! మున్నిటులఁ జేయవు క్రొత్తదనం బిదేందుకో?

వాస॥ : (ముఖము పరిశీలించి) ఇప్పుడు నీవు విలక్షణుడ వగు చున్నావు.

రాజు॥ : ప్రియా! నిజముగా నేను విలక్షణుడను. ఏలనన నీవు చూచు చుండఁ దప్పు చేసితిని. నిన్ను ప్రసన్నను చేసికొనుటకు పూనుకొంటిని.

సాంకృ॥ : (ఆసనము చూపి) మహారాజ! ఆసనము స్వీకరింపుము.

రాజు॥ : (ఆసనము చూపి) ఇక్కడ దేవి కూర్చొను గాక.

(వాసవదత్త భూమిపై కూర్చొనెను)

రాజు॥ : అఁ! దేవి భూమిపై కూర్చొన్నదే, నేనును ఇక్కడనే కూర్చొందును. (భూమిపై కూర్చొనును) ప్రియా! అనుగ్రహింపుము. నేను నమస్కరించు చున్నను గంభీరమగు కోపమును ఏల వీడకున్నావు?

శ॥ సీ॥ కనుబొమ ముడిలేదు, కంట నీరును లేదు
ముగ్ధేక్షణంబుల ముదిత చూచు
వధరంబు మిక్కిలి యదరదు విడువక
నిట్టూర్పులందిసి నెలత ! యుందు,
వేమియు మాటాడ, వెప్పుడు ధ్యాన న
మ్రాననంబున నుందు వబల ! నీదు
స్తిమితమౌ కోపంబు దెబ్బతీయును నన్ను
గాఢప్రకారంబు కరణి నేడు.

ప్రియా ! అనుగ్రహింపుము. (పాదములపై పడును.)

వాస॥ :- మిక్కిలి సుఖించుచున్నావు కద యిప్పుడు ! దుఃఖించుచున్నేల విచారింపఁజేయుదువు? లెమ్ము. లెమ్ము ఇట కోపించిన వారెవ్వరు ?

సాంకృ ॥ :- లెమ్ము, మహారాజా ! లెమ్ము. ఈమె యుద్వేగమునకు వేరొండు కారణ మున్నది.

రాజు :- (సంభ్రమముగ) భగవతీ ! ఏమది!

సాంకృ ॥ :- (చెవిలో చెప్పును)

రాజు :- (నవ్వి) ఇది ఇట్లైయైనచో ఇకనీ యుద్వేగము చాలును. నాకిది తెలియును. ఈ ప్రయోజనమందు నేను కృతకృత్యుడనయితిని. దేవికి సంతోష వృద్ధి పొందింపవలయునని ఇంతవరకు చెప్పలేదు. దృఢవర్మ వృత్తాన్తము వినియు ఇంత విసన్నముగ నుందునా? ఆ వార్త వచ్చి కొద్ది రోజులయినది. ఇప్పుడక్కడ జరుగుచున్నదిది.

సేనలు ముందుగా విజయసేనుని నేతృతనేగి
దుర్గమున్
బూనిక ముట్టడింప దనె పోయె ప్రభావము
శత్రురాజుకున్,
దాను కళింగ నీచుదట ధైర్యము వీడెను
చొచ్చె దుర్గమున్;
వానికి కోటగోడలె ఘనంబగు రక్షణయయ్యె
నత్తఱిన్.

అట్టియవస్థగల యాతడు

ఆహవంబున యందు నసమర్థుడయ్యెను
వీరభటోద్వృత్తి వెనుకబడియె
హయహస్తినర సేన హతమయ్యె పూర్తిగా,
శిథిలత పొద సూపె సేనయందు
నేడైన రేపైన నిక్కము నాసేన
కోటగోడలనెల్ల కూలద్రోసి
వెంటనే యెల్లెడ వెదకి శత్రునిపట్టి
సమయించె నను మాట సరగ వినెదు.

సాంకృ॥ :- రాజపుత్రీ ! వత్సరాజు ప్రతీకారము చేయకుండనుండునాయని నీకు తొలుతనే చెప్పితిని.

వాస ॥ :- ఇది యిట్లయిన నాకు మిక్కిలి ప్రియము.

(ప్రతీహారి ప్రవేశించి)

ప్రతీ॥ :- ప్రభువుకు జయము ! విజయసేనుడు దృఢవర్మ కంచుకితో కలిసి సంతోష సముత్ఫుల్ల లోచనుడయి ప్రియమును తెలుపు కోరికతో ద్వారమందున్నాడు.

వాస॥ :- (సస్మితముగ) భగవతి ! ఆర్యపుత్రునిచే సంతోషి పెట్టబడితినని తలచుచున్నాను.

సాంకృ ॥ :- వత్సరాజ పక్షపాతిని గదానేను. నేనే మియు పలుకను. (పిమ్మట విజయసేనుడు కంచుకి ప్రవేశింతురు)

విజయసేనుడు :- ఇప్పుడు స్వామి పాదములు చూడఁ బోవుచుండుటచే ఏదో సుఖాతిశయము ననుభవింపుచున్నాను.

కంచు :- అది నిజమే. చూడు.

గీ॥ స్వామి ఎట్లున్న భృత్యుడు వానిఁ గాంచి
సౌఖ్య నిర్భరుడగుచుండు సత్యముగను
శత్రులంగెల్చి ప్రభునియాజ్ఞను పొనర్చు
భృత్యుడానంద మందగా వింత ఏమి ?

(ఇరువురను సమీపించి)

ఇరువురు :- దేవా ! జయమగుగాక !

రాజు :- (ఇరువురను కౌగిలించుకొనును)

కంచు :— దేవీ ! అదృష్టవశమున వర్ధిల్లు చున్నావు.

ఆ॥ ఆ కళింగ హతకుడంతంబు చెందెను
మన ప్రభుండు రాజ్యమును గ్రహించె
విజయసేనుడిట్లు పెద ప్రభు నానతి
తానొనర్చి యిటకు దరలివచ్చె.

వాస॥ :— భగవతి! ఈ కంచుకిని నీ వెరుగుదువా?

సాంకృ :- ఎరుగకపోవుటేమి? ఈతని చేతనే నీ పినతల్లి నీకు పుత్రికా యుగమును పంపినది. అతడేకదా ఇతడు!

రాజు :— భళీ! విజయసేనా ! గొప్పపనియొన రించితివి. (విజయసేనుడు పాద ములపై పడును)

రాజు :- దేవీ ! అదృష్టవంతురాలవు. అక్క దృఢవర్మ రాజ్యము నందినాడు.

వాస :- (సంతోషముగ) అనుగ్రహింపబడితిని. ఆర్యపుత్రునకు జయమగుగాక.

విదూ॥ :- ఇట్టి అభ్యుదయ సమయమున రాజ కులములో ఇవి చేయవలయును. (రాజును చూపించి పీఠవాయించుట నటించుచు) గురుపూజ, (తన యజ్ఞోపవీతమును చూపుచు) బ్రాహ్మణ సత్కారము. (ఆరణ్యకను సూచించి) సర్వబంధన మోక్షమున్ను.

రాజు :- (వాసవదత్త వినకుండ, చిటిక వేయుచు) సాధు! మిత్రమా! సాధు!

విదూ :- భవతీ ! నీవిట నేమాజ్ఞాపించు చున్నావు?

వాస :- (సాంకృత్యాయనిని చూచి, సస్మిత ముగ) ఈ హితాభునిచే ఆరణ్యక విడి పింపబడినది.

సాంకృ - తపస్వినియగు నామెను బంధించియేమి ప్రయోజనము?

వాస :- నీ యిష్టమే కానిమ్ము.

సాంకృ :- అయినచో నేనే యామెనువిడిపింతును. (నిష్క్రమించును)

కంచు :- దృఢవర్మ మహారాజీ సందేశమును కూడ పంపెను. నీ అనుగ్రహము వలన కోరినదంతయు నెరవేరెను. అందుచే ఈ ప్రాణములు నీవి. వీనిని నీయిష్టము వచ్చినట్లుపయోగించు కొన వచ్చునని.

రాజు : (లజ్జతో తలవంచి నిలబడును)

విజ దేవా ! దృఢవర్మకు మీ పయినున్న ప్రీతి విశేషము వర్ణింపనశక్యము.

కంచు దేవా! నీకు ప్రతిపాదించిన నాకుమార్తె యగు ప్రియదర్శన తప్పిపోవుట వలన సంబంధము కాలేదని నాకు దుఃఖము కలిగినది. కావున వాసవ దత్తను నీవు పెండ్లాడుటచే దుఃఖము పోయినట్లే.

వాస ॥ -(కన్నీటితో) ఆర్య కంచుకీ ! నా చెల్లెలు తప్పి పోయినదా !

కంచు - రాజపుత్రీ ! ఆ కళింగ హతకుడు దండయాత్ర చేయగా అంతఃపుర కాంతలు అటునిటుచెదరగా, అమెను చూచి ఇక్కడ నీమె యుండకూడ దని నిశ్చయించి నేనామెను తీసికొని వత్సరాజు దగ్గరకు బయలుదేరితిని. ప్రయాణమునకననుకూలత కనిపించి తిరిగిరాగా వింధ్యకేతునితో కూడ ఆ ప్రదేశమెవరిచేతనో ఆక్రమింప బడినది.

రాజు (సస్మితముగ) విజయసేన ! ఏమి చెప్పుదును?

కంచు :- అచ్చట ఎంత వెదకినను ఆమె నాకు దొరకలేదు. అప్పటినుండి ఆమె ఎక్కడనున్నదో తెలియదు.

(అంతట మనోరమ ప్రవేశించును)

మనో :- భట్టినీ ! ఈ తపస్విని ప్రాణసంశయ మందున్నది.

వాస :- (కన్నీటితో) ప్రియదర్శనా వృత్తాన్తము నీవు నెరుంగుదువా !

మనో :- ప్రియదర్శనా వృత్తాన్తము నేనెరుగుదును. ఈ ఆరణ్యిక ఉదయకాల భోజన మివతో విషము త్రాగి ప్రాణసంశయ మందున్నదని నేను విన్నవించు చున్నాను. కావున భట్టిని రక్షింప వలెను. (అని యేడ్చుచున్నది)

వాస ॥ :- (స్వగతము) అయ్యో ! ప్రియదర్శనా దుఃఖమారణ్యికా వృత్తాన్తముచే మరుగున పడినది. లోకమతి దుర్జనము. నన్ను మతియొక విధమున భావింప వచ్చును. కావున ఇప్పుడిట్లు చేయ వలెను. (ప్రకాశము సంభ్రమముగ) మనోరమా ! ఇచ్చటికే తీసికొని రమ్ము. స్నాతలోకములో విషవిద్య నేర్పిన ఆర్యపుత్రుడిటనున్నాడు.

(మనోరమ నిష్క్రమించును. పిమ్మట మనోరమచే తీసికొని రాబడి విషవేగము నటించుచున్న ఆరణ్యిక ప్రవేశము)

అర ॥ :- సఖి ! మనోరమా ! ఎందుల కిప్పుడు నన్నీ యంధకారములో త్రోయు చున్నావు?

మనో ॥ :- (విషాదముగ) అయ్యో ! అయ్యో ! విషము కన్నుల కెక్కినది. భట్టిని ! వేగముగ రక్షింపుము. ఈమెకు విష మధికముగ ఎక్కినది.

వాస ॥ : (సంభ్రమముగ రాజును తన చేతితో గ్రహించి) ఆర్యపుత్ర! వేగముగ లెమ్ము. ఈ తపస్విని ఆపదలో నున్నది.

(అందరూ చూచుచున్నారు)

కంచుకి ॥ : (చూచి) ఈమె రాజపుత్రి ప్రియదర్శన నెంతయుం బోలియున్నది. (ప్రకాశముగ, వాసవదత్తను చూచి) రాజపుత్రీ ఈ కన్యక ఎక్కడిది!

వాస ॥ : ఆర్య ! వింధ్యకేతుని కూతురు. ఆతనిని చంపి విజయసేనుడీమెను తెచ్చినాడు.

కంచుకి ॥ : ఆతని కూతురెక్కడ ? ఆ రాజపుత్రియే హా! హతోస్మి ! మందభాగ్యుడను. (భూమి మీదపడి లేచి) రాకుమారీ! ఈమెయే. ఆ ప్రియదర్శన నీ చెల్లెలు ఆపదలో నున్నది.

వాస ॥ : ఆర్యపుత్ర ! రక్షింపుము. నా సోదరి ఆపదయందున్నది.

రాజు ॥ : ఊరడిల్లు మూరడిల్లుము. చూచెదను. అక్కటా

గీ॥ చిక్కనౌ తేనె సోనలం జెలువు మిగులు
తమ్మి మొగ్గను భృంగము తమిని జేర
మంచు తాకిడి నా మొగ్గ మాసిపోయె
వాంఛ ఫలియింప నేరదు వామవిధిని.

మనోరమా! ఆమెకు తెలివియున్నదో లేదో అడుగుము.

మనో ॥ : సఖి ! నీకు స్మృతి యున్నదా ?

(కన్నీటితో కదుపును) చెలీ ! నీకు స్మృతి యున్నదా ?

ప్రియ॥ : (అవిస్పష్టముగ) ఇంత అవస్థ పొంది నను ఆ మహారాజు కనబడనే లేదు. (అర్ధోక్తిలోనే భూమిమీద పడును)

రాజు ఉ॥ సీ॥ కన్నులు మూయుచున్నదీ కమలాక్షి
అలమె చీకటి నాకు నలు దెసలను
ప్రతిరుద్ధమయ్యె నీ పడతికిఁ గంఠంబు
అతికష్టమున మాటలాడఁచుంటి
శ్వసితంబు హతమయ్యె వనిత కీమెకు నాకు
తనువె నిశ్చేష్టత నెనసియుండె
విషవేగమొక్కఁటే ప్రియురాలి వేధించు
నంతట దుఃఖమే యయ్యె నాకు.

వాస॥ (కన్నీటితో) ప్రియదర్శనా ! లెమ్ము ఇదుగో మహారాజు ఇటనున్నాడు. ఇప్పుడేమి ప్రయోజనము? తెలియక తప్పుచేసితిని. అందుచే కోపించి నాతో మాటలాడవు. అనుగ్రహింపు మను గ్రహింపుము. మరి ఇక ఎట్టి తప్పును చేయను (మీదికి చూచి) దైవహతక! నేనేమి యపకారము చేసితిని. నా సోదరి ప్రియదర్శన ఇట్టి యవస్థ నందినది. (ప్రియదర్శనపై పడును)

విదూ॥ ఓ వయస్య ! ఏల మూఢుని వలె నుండి పోయితివి? ఇది విషాదమునకు కాలము కాదు. విషము విసమించు చున్నది కద! కావున నీ విద్యా ప్రభావమును చూపుము.

రాజు॥ నిజమే. (ప్రియదర్శనను చూచి) ఇంత వరకు నేను మూఢుడనైతిని. ఇప్పుడే ఈమెను బ్రతికింతును. నీరు నీరు...

విదూ॥ : (పోయి తిరిగి వచ్చి) ఇదిగో నీరు.

రాజు॥ : (చేరి ప్రియదర్శన మీద చేయి వేసి మంత్రమును జపించుట నటించును)

ప్రియ॥ : (మెల్లగా లేచును)

వాస॥ ! అదృష్టవశమున నా సోదరి తిరిగి బ్రతికినది.

విజ॥ : ఓహో! ప్రభువు విద్యా ప్రభావము.

కంచు॥ : అహో! ప్రభువు నరేంద్రత అన్ని చోటుల నప్రతిహతము కదా!

ప్రియ॥ : (లేచి కూర్చొని ఆవులింత నటించుచు అస్పష్టముగ) మనోరమా! చిరకాలము నిద్రపోయితిని గదా! ఏమీ ఎవరి యందును చైతన్యమే లేకున్నది.

విదూ॥ మిత్రమా! నీ మంత్ర వాదిత్వము స్పష్టమయ్యెను.

ప్రియ॥ (సాభిలాషముగ రాజును చూచి) (సలజ్జముగ కొంచెము ముఖము వంచియుండును)

వాస॥ ఆర్యపుత్ర ! ఇపుడు కూడ నీమెను విషము అస్వస్థురాలిగా చేయుచున్నదా?

రాజు॥ (సస్మితముగ)

ఉ॥ సీ॥ దృష్టియా సహజమౌ తీరున లేదింక
పలుకులు విశదమౌ ఖాతిలేవు
ఒడలేమొ పులకల నొప్పెను చెమటచే
తనువెల్ల మిక్కిలి తడిగనయ్యె
స్తన భారమును మోయ జనియించు క్లేశాన
నిలువెల్ల కంపించు నెంత కిపుడు
తలతు నిప్పుడు కూడ తరుణికి విషమెల్ల
దిగుట లేదని కొంత మిగిలెననియు

